# ఆకాశ దీపాలు

(కథల సంపుటి)

రచన

అవసరాల సూర్యారావు

ప్రస్తావన

కొడవటిగంటి కుటుంబరావు

నగారా ప్రచురణాలయం

కొత్తపేట, గుంటూరు - 1.

ప్రథమ ముద్రణ
ఫిబ్రవరి 1954.

ప్రచురణ నెం. 4.

వెల రు 1-0-0.

లక్ష్మీ ఆర్టు ప్రింటర్స్, కొత్తపేట, గుంటూరు-1.

I

# ప్రిస్తావన

ఈనాటి తెలుగుసాహిత్యంలో మిగిలిన అన్ని రూపాల కన్నా ప్రశస్తంగా అభివృద్ధిలోకి వచ్చినటువంటివి చిన్నకథా, ఖండకావ్యమూ, గేయమూనూ. ఇది ప్రమాద వశాన గాని, అకారణంగా గాని జరిగిన పరిణామం కాదు. ఈనాటి వాతావరణంలో నవలా రచనకన్నా, నాటక రచనకన్నా, వ్యాస రచనకన్నా, పద్య కావ్య రచనకన్నా కథా రచనకూ, ఖండ కావ్య రచనకూ, గేయ రచనకూ ఎక్కువ ప్రోత్సాహం లభించింది. రచయితలలో ఎక్కువమంది ఈ రూపాల సాహిత్యంలో కృషి చేశారు.

ఏ యుగంలోనైనప్పటికీ ఏ సాహిత్య స్వరూపంలో ఎక్కువమంది కృషి చేస్తారో అదే ఉన్నతస్థితికి వచ్చి రాణించ గలుగుతుంది. నేటి తెలుగు కథ – లేక కథానిక – ఏ ఇతర భాషలోగల కథకూ తీసిపోదు. తెలుగు కథలు రాసేవారి సంఖ్యకూడా చాలా హెచ్చుగా ఉంటున్నది.

మన భాషలో చిన్నకథ పైకిరావటానికి తోడ్పడిన భౌతిక శక్తులలో పత్రికలకు అగ్రస్థానం ఇచ్చితీరాలి. ఈనాడు ఈ పత్రికల సంఖ్య హెచ్చు. వీటిలో ఇతర సాహిత్య రూపాల కన్నా చిన్నకథలే హెచ్చుగా ప్రకటిత మవుతున్నాయి. దేశంలోని అత్యధిక సంఖ్యాకులైన ప్రజలకు సాహిత్యమనేది అచ్చుగా పత్రికలద్వారా మాత్రమే లభ్యమవుతోంది. ప్రకటనలు వగైరా ఆర్థిక సదుపాయాలుండటంచేతా, విషయ వైవి

ధ్యాన్ని పురస్కరించుకునీ ఈ పత్రికలు పుస్తకాలకంటె చౌకగా ఉంటూ, ప్రజాదరణను హెచ్చుగా సంపాదించుకో గలుగుతున్నాయి.

రచయితల దృష్టినుంచికూడా చిన్నకథలో ఉన్న ఆక ర్షణ ఇతర సాహిత్య రూపాలలో - ముఖ్యంగా, దీర్ఘతరమైన నవల, నాటకం, పద్యకావ్యం మొదలైన వాటిలో - లేదు. ఈ నాడు తెలుగుజాతికి సాహిత్యసృష్టి జీవనోపాధికమైనది కాదు. సాహిత్యాభిలాషా, సాహిత్యదక్షతా కలవారు సయితం ఉదర నిమిత్తం మరొక వృత్తి ఏదైనా చూసుకుంటూ, తీరిక సమయాలలో సాహిత్యకృషి చేయాలి. ఇలాటి స్థితిలోఉన్న రచయితలు దీర్ఘ రచనలు చేయటం అంతగా సాధ్యం కాదు. కవితాశక్తి ఉన్నవాడు ఖండకావ్యమో, గేయమో రచించ వచ్చు. కాల్పనికశక్తి కలవాడు కథ రాయవచ్చు. ఈ కృషి బొత్తిగా వృధా కావలసిన అవసరంకూడా లేదు. ఇలాటి కథ లనూ, గేయాలనూ ప్రచురించటానికి సిద్ధంగాఉన్న పత్రిక లనేకం ఉన్నాయి. వీటిలో కొన్ని తృణమో పణమో ఇస్తాయి కూడానూ.

చిన్న కథయొక్క వ్యాప్తికీ, అభివృద్ధికీ ఇవి సన్నిహిత కారణాలు. ఇక, దూర కారణాలుకూడా కొన్ని లేకపోలేదు. చిన్న కథయొక్క స్వరూపంలోనే కొన్ని ఆధునిక జీవిత లక్షణాలున్నాయి.

ఈనాటి జీవితం క్లిష్టమైనది. దాని అంతరార్థం ప్రతి ఒక్కరికీ సులభగ్రాహ్యంకాదు. సాహిత్యకళద్వారా ఈ క్లిష్ట

జీవితాన్ని ప్రతిబింబించి, జీవిత సత్యాలను వ్యక్తం చేయాలంటే అసాధారణ ప్రపంచజ్ఞానం కలవాడికి మాత్రమే సాధ్యమవుతుంది. ఈ పరిస్థితిలో చిన్నకథ ఒక మహోపకారం చేస్తోంది. చిన్నకథలో ప్రతిబింబితమయే జీవిత శకలం చాలా చిన్నది. పరిశ్రమల అభివృద్ధితో ఉత్పత్తి విధానాలలో కార్యవిభజన ఏర్పడిన విధంగా, ఈనాటి చిన్నకథలద్వారా వందమంది వంద జీవితశకలాలను వంద కథలలో ప్రతిబింబింపజేసి పూర్వపు మహాకవులు ఏకాంతంగా నిర్వహించిన భారాన్ని తమమధ్య తాము విభజించుకుని పని సులువుచేసుకుంటున్నారు. నేటి కథకుడు తనకు పరిచితమైన జీవితాన్నీ, పాత్రలనూ, వాటి అనుభవాలనూ, ఆ అనుభవాల వెనకఉండే జీవితసత్యాన్నీ మాత్రమే ఆధారంగా చేసుకుని రచన సాగిస్తాడు; సాహిత్యకళ సమాజం మొత్తంమీద సాధించదగిన ప్రయోజనానికి తన "చందా" తాను ఇచ్చుకుంటాడు. ఇందువల్ల ప్రజలకు జీవితపు వివిధకోణాల అనుభవం అందే అవకాశమూ, జీవితం గురించి విస్తృతమైన జ్ఞానం సంపాదించే అవకాశమూ చిక్కుతున్నాయి. మహా నగరాలలోవాళ్లు పల్లెటూళ్ళనుగురించీ, పల్లెటూళ్లవాళ్ళు మహా నగరాలనుగురించీ తెలుసుకోగలుగుతున్నారు; సంపన్నులు శ్రామికులనుగురించీ, శ్రామికులు సంపన్నులను గురించీ తెలుసుకోగలుగుతున్నారు.

చిన్నకథలో ఈనాటి ప్రజాస్వామ్యంకూడా ప్రతిబింబితమవుతున్నది. సంఘంలోనుంచి ఏ క్షుద్రపాత్రను తీసుకొని అయినాసరే చిన్నకథ రచించవచ్చు. పూర్వపు ఆలంకారికులు నిర్వచించినట్టుగా నాయకుడు కొద్ది రకాలకు మాత్రమే చెందా

లన్న నియమం ఈనాటి చిన్నకథకు లేదు. దాని శిల్పంలో కూడా అంతులేని వైవిధ్యానికి అవకాశాలున్నాయి, సౌలభ్యం కూడా ఉంది. కథకుడు కథను తన స్వీయానుభవంగా చెప్ప వచ్చు, తన కళ్ళఎదట జరిగిన సంఘటనగా చిత్రించవచ్చు, లేదా సర్వాంతర్యామి అయిపోయి వేరువేరు చోట్ల జరిగిన సంఘటనలనూ, సంభాషణలనూ, వివిధవ్యక్తులు తమ హృద యాలలో అనుకున్న భావాలనూ అతిసూక్ష్మంగా వర్ణించవచ్చు. ఆఖరుకు తాను తనఅనుభవంగా వర్ణించిచెప్పే కథలోని సత్యాన్ని తాను అర్థం చేసుకోలేకపోయినవాడుగా నటిస్తూకూడా కథనం చేయవచ్చు. ఇలాటి అవకాశాలు నవలలూ, నాటకాలూ రాసేవారికి లేవు.

పఠిత దృష్ట్యాకూడా చిన్నకథ ఈనాడు అనుకూలమైన సాహిత్యరూపం. పెద్ద గ్రంథాలలాగా కాకుండా చిన్న కథలు ఒక్క గుక్కలో, కొద్ది విరామంలో చదవవచ్చు. కథ అయి పోయే సమయానికి మొదలు మరిచిపోవలసిన అవసరం లేదు.

పైన చెప్పిన విషయాలన్నీ చిన్న కథయొక్క స్వభా వాన్నీ, దానితో రచయితకూ పాఠకుడికీగల సంబంధాన్నీ సూచిస్తాయి.

## 2

ఇక చిన్న కథకుగల సామాజిక ప్రయోజనం గురించి ఆలోచింతాం. ఇది అన్ని సాహిత్య రూపాలకూ, ఆ మాటకు వస్తే అన్ని కళలకూ, ఒకటిగానే ఉండాలి; ఉంటుందికూడా. జీవితానికి అనేక దృక్కోణాలున్నాయి. ఒక కోణంనుంచి

చూసేవాడికి ఒక విధంగానూ, ఇంకో కోణంనుంచి చూసేవాడికి ఇంకో విధంగానూ కనిపిస్తుంది జీవితం. ఒక ఊరికి రాత్రి పదిగంటల బండి మరొక ఊరికి ఉదయం పదిగంటల బండి అవుతుంది. ఒక స్టేషను విడిచినబండి ప్రక్క స్టేషనుకు రానున్న బండి అవుతుంది. కాని ఈ "ఉదయంబండి", "రాత్రిబండి", "పోయినబండి", "వచ్చేబండి" అన్నవి పాక్షిక సత్యాలు. ఆ బండినిగురించి సంఘ ప్రయోజనం ఆలోచించటానికి ఈ పాక్షిక సత్యాలు పనికిరావు. కళల విషయంలో కూడా అంతే.

సంఘంలోని వ్యక్తులు కూడా ఒకకంటికి కనబడినట్టు ఒక కంటికి కనపడరు. ధనికులూ, అధికారులూ అర్థ జిజ్ఞాసువులకు ఆశ్రయించ దగినవారుగా, మెప్పించదగినవారుగా కనబడతారు; వారే తమ సేవకులకు కర్కోటకులుగా, రాక్షసులుగా, కోపంవస్తే ప్రమాదం కలిగించ గలవారుగా కనిపిస్తారు. అదే విధంగా శ్రామికులు ధనికులకు సంస్కార హీనులుగా, అవకాశం దొరికితే ప్రమాదం చెయ్యగలవారుగా కనిపిస్తారు; వారే తమ భార్యలకు తోటి శ్రామికులుగా, శ్రమలో భాగస్వాములుగా, తమ పిల్లలకు అన్నదాతలుగా కనిపిస్తారు.

కళాకారుడు జీవితంలో తాను చూసే వివిధవ్యక్తులకూ, వివిధ సంఘటనలకూ సంఘపరంగా విలువకట్టగలిగినప్పుడే తన కళద్వారా సాంఘిక ప్రయోజనాన్ని సాధించగలుగుతాడు.

సంఘజీవి అయిన మానవుడు ఏదో ఒకవిధమైన వర్గీకరణకు గురిఅయి దానికి అనుగుణమైన జీవిత దృక్పథాలను అల

వరుచు కుంటాడు. "నాది ఫలానా కులం", "నాది ఫలానా మతం", "నాది ఫలానా తరగతి" అనే భావాలమీద సాంఘిక చైతన్యాన్ని పెంచుకున్నవాడు ఆయా కులాల, మతాల, తరగతుల దృక్కోణంనుంచి జీవితాన్ని అర్థంచేసుకుంటాడు. "నేను అన్నివర్గాలకూ అతీతుణ్ణి" అనుకునేవాడు కేవలం ఆత్మ వంచనచేసుకుంటాడు. ఎందుచేతనంటే సంఘంలో ఇన్నిరకాల వర్గీకరణలకు తావున్నసమయంలో అన్నిటికీ అతీతంగా వెళ్లాలంటే జీవితానికే దూరం వెళ్లిపోవాలి. ఇది పలాయనతత్వం అవుతుంది. అందుచేత కళాకారుడు జీవితసత్యం ఏవిధమైన వర్గీకరణపై ఆధారపడి ఉన్నదీ ముందుగా, బుద్ధిపూర్వకంగా, నిశ్చయించుకోవాలి. అప్పుడే అతని కళ సంఘ ప్రయోజనాన్ని సాధించగలుగుతుంది.

నేటి ప్రపంచమంతటా అభ్యుదయవాదులు ఆర్థిక కారణాలవల్ల ఏర్పడే తరగతుల విభజనలో జీవితవాస్తవం ఉన్నదని విశ్వసిస్తారు. ఈ విభజనను పురస్కరించుకుని జరిగే జీవిత సంఘర్షణ ద్వారానే సాంఘిక పరిణామం ముందుకు పోతుందని విశ్వసిస్తారు. ఇందులో స్వార్థప్రేరణ ఉండ నవసరంలేదు. ఏమంటే అభ్యుదయవాదులు స్వయంగా ఏవర్గానికి చెందినవారైనా పీడితవర్గాల పోరాటాన్ని బలపరుస్తారు, దాన్నే వాస్తవమైన జీవితపోరాటంగా గుర్తిస్తారు. జీవితసత్యం ఇటే ఉంది.

ఇదంతా కమ్యూనిజముకు ప్రచ్ఛన్నరూపమనే క్షుద్ర వాదం లేకపోలేదు. కమ్యూనిజం క్షుద్రమైనదనికాదు; ఈ వాదం ద్వారా కళా ప్రయోజనానికి సంకుచితత్వం ఆపాదించటం క్షుద్రప్రక్రియ. కమ్యూనిజంఅనేమాట పుట్టనికాలంలో

బానిసత్వాన్ని అణచటానికీ, సజీవ భార్యలను మృతభర్తల చితులమీదనుంచి రక్షించటానికీ, నిరంకుశుల దుష్పరిపాలన నుంచి అనాథ ప్రజలను రక్షించటానికీ, దాస్యశృంఖలాలనుండీ సామ్రాజ్యవాదులనుండీ పీడిత ప్రజాకోటిని రక్షించటానికీ మహోజ్వలమైన ఉద్యమాలు నడిచాయి, విప్లవాలు జరిగాయి. వాటి ఫలితంగా మానవ చరిత్ర ముందుకు నడిచింది. మన కాలంలోనే పీడకులనుండి పీడితవర్గాలను రక్షించటానికి కందుకూరి వీరేశలింగంగారు తమ కలాన్ని కత్తిలాగా వినియోగించారు. సాంఘిక ప్రయోజనం కొరకు యత్నించే అభ్యుదయ కళలు ఈ మార్గం తొక్కక తప్పదు.

## 3

ఈ పుస్తకంలోని కథలు రచించిన కథకుడు అభ్యుదయ వాది. తన రచనలద్వారా వాస్తవ జీవితాన్ని చిత్రించి, సంఘ ప్రయోజనం సాధించే ఆశయంగలవాడు. ఇందులోని పాత్ర లన్నీ సజీవంగా, వాస్తవంగా ఉంటాయి. వాటి చిత్తవృత్తులు కూడా సహజంగా ఉంటాయి. జీవితానికీ వివిధ పాత్రలకూగల సంబంధం రకరకాలుగా చిత్రించబడింది.

"ఊరేగింపు" అనే కథలో పోలీసు సాంబయ్య సమ్మె చేసి ప్రదర్శనాలిచ్చే కుర్రాళ్లమీది కాల్పులలో పాల్గొని, వాళ్లు సమ్మె చేస్తున్నది జీతాల హెచ్చింపుకు నిరసనగానన్నది తెలుసుకొంటాడు. జీతాల హెచ్చింపునూ తనూ నిరసించిన వాడే! అయినా బారకాసునుంచి బిగిల్ వినిపించగానే డ్యూటీకి బయలుదేరుతాడు. వెనకనుంచి పెళ్లాం "ఎవర్నీ కాల్చకు, నీ పుణ్యముంటుంది", అంటుంది.

''అన్నయ్య వెళ్లినదారి'' అనే కథలో ఒక మధ్యతరగతిపిల్ల తనకిష్టంలేని పెళ్లికి గురి కాబోతూ ''అన్నయ్య'' వెళ్లిన దారికేసి చూస్తుంది. అన్నయ్యకూడా పెళ్లి నిశ్చయించారు. ''కడిగిన ముత్యం''లాంటి వావిలాలవారి ఇందిరతో పెళ్లి. కాని ఆ పెళ్లి ఇష్టంలేక అన్నయ్య ''మానవజాతి భవిష్యత్తుగురించి'' రాత్రికిరాత్రే ఇల్లు వదిలి ''సిద్ధార్థుడు బుద్ధుడు కావడానికి'' వెళ్లినట్టు వెళ్లిపోయాడు. ''మాలమ ట్టెళ్లా మొహం'' నర్సమ్మ కొడుకును పెళ్లి చేసుకోకుండా తప్పించుకోవాలంటే అమ్మాయికి అన్నయ్య వెళ్లినదే దారి!

''షష్టి పూర్తి'' లో ముత్యాలు సమస్య జమీందారుగారి షష్టిపూర్తికి పదిరూపాయ లిచ్చుకోడం. ఇంకో సమస్య కూతురు వెంకిముండకు పూలు తెచ్చిపెట్టడం. వెంకి పూలన్నా ఆగుతుందిగాని షష్టిపూర్తి ఆగదు. ఈ కథలో ముత్యాలు ఒక ప్రత్యేక పాత్రగాదు, ముత్యాలు సమస్య ఒక ప్రత్యేక సమస్యగాదు. దివాణం దుష్పరిపాలనలో నలిగి హతమవుతున్న అశేష జనానికి ముత్యాలు ప్రతినిధి.

''పాలికాపు'' రాముడుగాడు పల్లెజీవితం దుర్భరమై బస్తీకిపోయి బాపుకుందామని గంపెడాశతో వెళ్లి, తీరా పని దొరికితే తాను సమ్మెచేసే పాకీవాళ్ల పొట్టలుకొడితేనేగాని రెండు రూపాయలు చేతిలో పడవనీ, దేశాన్ని నడిపించిన గాంధీటోపీలవాళ్లూ ఈ పనేచేస్తున్నారనీ తెలుసుకుంటాడు.

''కొత్త పుంతలు'' అనే కథలో పైడితల్లి చుట్టలు కట్టేవాళ్లచేత సంఘం పెట్టించి సమ్మెచేయిస్తాడు. కూలీల

జీతం వంద చుట్టలకు అర్ధణా పెంచమంటే షావుకారు ససేమిరా అంటాడు. సమ్మెను పైవాళ్ళెవరూ బలపరచరు. షావుకారు ఏజెంట్లు భగ్నం చెయ్యటానికి ఎన్ని ఎత్తులైనా వేస్తారు. కూలీలు జారిపోయే సమయానికి పైడితల్లి తానే స్వయంగా చుట్టల వ్యాపారం నడపటానికి నిశ్చయించి, వ్యాపారంలో కూలీలకి వాటా లిచ్చేస్తాడు. లేబరు చుట్టలు కానుచౌక, ఘాటుగా కాల్తాయి. షావుకారే లేబరుచుట్టలకు ఏజెంటవుతాడు.

"అన్నదమ్ముల పంపిళ్లు" కథలో ఇద్ద రన్నదమ్ములు తమతమ సంసారాల సమస్యలు భిన్నంకాగా వాటిని పరిష్కరించుకునేటందుకు వేర్లు పడతారు.

కథలన్నిటిలోనూ చిక్కదనం, పట్టుకుంటే చివరిదాకా పాఠకుణ్ణి లాగేసే శిల్పం, ఉంది. కథనంలో రమ్యత్వం, చదివే దానియందు పాఠకుడికి ఆసక్తి కలిగించే గుణం, ఉంది.

ఈ రచయిత శైలిలో వేగమూ, ఉత్సాహమూ, ఒక్కొక్కచోట అతి చిత్రమైన ధ్వనీ ఉన్నాయి. కథ చదువుతూంటే విరగబూచిన చెట్టును చూస్తున్నట్టుంటుంది. అక్కడక్కడా పూలగుత్తుల్లాటి మాటలు కనిపిస్తాయి... "ఊరేగింపు చాలా దగ్గరనా జరిగింది. ఉత్సవంలాటి ఊరేగింపు! దేవతల ఊరేగింపు!"... "అన్నయ్యలాంటి అన్నయ్యలంతా చేతులూ చేతులూ కలిపి గొలుసు కడతారట. ఆ గొలుసే మానవజాతి భవిష్యత్తును రక్షిస్తుందట!"... "చెరువంటే చెరువా! వాజారవా చెరువు! గోదావరి కాలవ విడిచిపెట్టేసరికి నీరు గలగలమని మువ్వల మోతలు చేసుకుంటూ చెరువంతా నింపుతుంది.

తొలిచూలు ఆడ మాలక్ష్మిలా వుంటుంది చెరువు. మన్ను మేటవేసి అయిదారేళ్లయి బోర్లించిన కడవలాగయిపోయింది కానీ ... ప్రతి ఏటా చంటిపిల్లలా మన్నుతింటే చెరువు గర్భంలో బల్లపెరుగక మానుతుందా!''... "సీతి గుండెబాదు కుని ఏడిచింది! పెద్ద చెరువంత ఏడుపు! దివాణం చెరువంత ఏడుపు!''... "చీపుళ్లు పుచ్చుకుని గాంధీ టోపీలు తుడుచుకు పోతున్నాయి; వెనకటి తమ ఉజ్వలపాత్రను భారతదేశ చరిత్ర లోంచి తామే తుడిచిపారవేసుకుంటున్నట్టు!''ఇలాటి వాక్యాలు ఈ కథలలో అసంఖ్యాకాలుగా ఉండి, పుస్తకం మూసేసినాక కూడా పాఠకుడి చెవుల్లో గింగురుమంటూ ఉంటాయి. ఈ కథల లోని భాషలో ప్రాంతీయ నుడికారమూ, జాతీయ నుడి కారమూ. పాత్రనుడికారమూ కుప్ప తెప్పలుగా గోచరిస్తుంది.

ఈనాటి కథకులలో అభ్యుదయ భావాలూ, వాస్తవిక దృక్పథమూ బాగానే విస్తరించి ఉన్నప్పటికీ, జీవిత పోరాటానికి సన్నిహితంగా ఉండి, ఆ పోరాటంలో ప్రముఖపాత్ర నిర్వహించే ప్రజల మనస్తత్వాలనూ, పరిసరాలనూ జీర్ణంచేసుకొని కథలు రచిస్తున్న కథకులు బహు కొద్దిమంది. ఆ కొద్దిమందిలో ఈ రచయితకు మంచి స్థానమున్నదని నిస్సంకోచంగా చెప్పవచ్చు. ఈ కథలను చదివిన యువరచయితలు తాము కథారచన చెయ్యటానికి కొత్త ఉత్సాహాన్ని ఈ కథల ద్వారా పొంద గలుగుతారని నా నమ్మకం.

— కొడవటిగంటి కుటుంబరావు.

---

# ఊరేగింపు

దూరంగా బుడబుక్కలవాడు 'అంబా! పలుకూ! జగదంబా పలుకూ!' అని అరుస్తున్నాడు. నర్సమ్మ కల్లాపు జల్లుకుందుకు కళ్లు నులుపుకుంటూ లేచింది. ఎదురుగా కుక్కి మంచంమీద మాధవుడు మూడంకె వేసుకొని పడుకున్నాడు. వీపు తట్టుతూ నర్సమ్మ "నెగరా! నెగూ!"

పొయ్యిలో పిల్లిపిల్లలా ముడుచుకు ముడుచుకు పడుకున్నాడు మాధవుడు. 'శనేశ్వడ్డ! సదువ్వొస్తే చాలు, మొద్దు నిద్దర!'

కొడుకు భుజాలను పట్టుకుని గుంజింది తల్లి; ఉలుక్కుపడి లేచాడు కొడుకు. 'వెధవచదువు!'

'హాఁ! మారే! ఎదవ సదువు, అబ్బాయిగారికి! తోటి బొట్టెడు వేణులాగే సదువుతాట్రా?'

దీర్ఘాలుతీస్తూ తల్లి తన పాతచీరె తెచ్చి నాలుగు పొరలు వేసింది. కొడుకు వొంటినిండా కప్పి జారిపోకుండా గొంతుకట్టు వేసింది! మాధవుడు చిరుబురు లాడుతూ లేచాడు. 'ఉపహుహు' అని గునిసేడు. బుంగమూతి పెట్టాడు.

'ఏటాన్ని నీకాసీకాకూ! నువ్వు సదువు సదివి నా ఒళ్లో పోయకక్కర్లేదులే. సదువుకుంటావేమో! కలెక్టేర్లు చేస్తావ్. పెళ్లాం వొళ్లో దోసిళ్ల కొద్దీ గుమ్మరించి పోస్తావ్! ఆలికన్నం పెట్టడం ఊరికుపకారమేట్రా?'

పొద్దున్నే పెళ్లాం మాట చెవిని పడింది; కుర్రవాడికి కులుకు హెచ్చింది. రాని పెళ్లామంటే ఎంతరోకు!

పేకేజీపెట్టెలోని పుస్తకాలుతీసి గుడ్డిదీపంముందు కూచున్నాడు. కొడుకు పుస్తకం తెరిచేదాకా నించుని, కడవతో నీళ్లు పట్టుకుని బయటకు వెళ్లింది. గదిలో అప్పటికప్పుడే తనపెనివిటి లేచి చుట్ట కాల్చుకుంటున్నాడు. బయట గుమ్మంలో ముక్కుతో కూనిరాగం తీస్తున్న భార్య, లోపల గణ గణ చదువుతున్న కొడుకు, ఇద్దరూ మనసులో మసలినట్లయి కళ్లు మూసుకుని చుట్టపొగ వొదులుతున్న సాంబయ్య చిరునవ్వు నవ్వుకున్నాడు.

మాధవుడు "ది బోయ్ స్టుడాడ్డీ బర్నింగ్ డెక్ ... బర్నింగ్...బర్నింగ్ డెక్" అని చదువుకుపోతున్నాడు. ఇంటి వాసాలు ఎగిరేటంతగా గొంతుక హెచ్చించాడు. చదువుకుంటున్న కొడుకుజుత్తు గాలికెగురుతూంటే ముచ్చటగాచూస్తూ మురిసిపోతున్నాడు తండ్రి. చుట్టపొగవదిలి నోకెళ్ళబెట్టాడు. పొగగదిలో సున్నాలు చుట్టుకోంది.

బయట చలిగాలి రొప్పుకొస్తోంది. ఉబ్బసంవాడిలా గురగురమంటున్న గాలి; దిక్కుమాలిన గాలి. వొళ్ళంతా సూదులు గుచ్చుతున్నట్లు వెధవ గాలి. గాలిని తిట్టుకుంటూ

సాంబయ్య మొహం కడుక్కుంటున్నాడు. బయట కల్లాపు జల్లి ముక్కుతో కూనిరాగాలు తీస్తోంది నర్సమ్మ.

మాధవుడు బాసినమఠంవేసి, పుస్తకం కిందపారేసి, కునుకుపాట్లు పడుతున్నాడు. గుడ్డిదీపం మరీ మరీ తెల్లబోతు న్నది. తెలతెలవారుతున్నది.

సాంబయ్య గలీబులో తలగడా దూర్చినట్లు కాకీని క్కర్లో పిక్కల్ని ఎక్కిస్తున్నాడు. నిక్కర్లో చొక్కావుంచి బిగూతుగాలాగి కాలికి బూటు తొడిగాడు. దువ్వెనతో మీసం పీక్కుంటూ "ఎదవ డిప్పిల్లు! కైరాతే నా కొడుకు డిప్పిల్లాని!" అని సణుక్కుంటున్నాడు.

కొడుకు గొంతుక వినిపించడంలేదు.

'సదవరా? సదువేస్సి!'

గతుక్కుమని మాధవుడు కోక ముసుగులోంచి మంటి పుక్కటంలాగ చూస్తూ 'ఊ...ఊ...ఊ... ది బోయ్ స్టుడ్ ...ఞూ ఆన్‌దీ బర్నింగ్...యింగ్ డెక్' అని చదువులో ఏడు పును మోతాదుగ రంగరిస్తున్నాడు. అసలు వాడికి చదవా లనేలేదు. ఆమాటకొస్తే స్కూలుకు వెళ్లాలనే లేదు. పుస్తకం తీసి చదవడమంటే మహా పౌరుషంగావుంది. స్కూలుకు వెళ్ళడమంటే పరువు తక్కువ!

పరువు తక్కువా, తక్కువన్నరా! ప్రతినెలా పదిహేనో తేదీ రావడం తరవాయి, స్కూలుపిల్లలంతా యించు మించు జీతాలు కట్టేస్తారు. మళ్లీ పదిహేనొచ్చినా తనుమాత్రం జీతం కట్టడు. రోజూ మాస్టరుగారు 'ఏరా, జీతంమాటా' అంటూ

కళ్ళజోళ్ళోంచి గుడ్లగూబలా తనకేసి చూసి గద్దిస్తాడు. అడిగి డిగి ఓ రోజున పెన్‌తీసి ఎటెండెన్సులో వున్న 'మాధవరావ'న్న నాలుగక్షరాలనీ అటూ ఇటూ కొట్టిపారేస్తాడు. మాధవుడికి నరనరం తెగిపోతున్నట్టే మరి!

ఆ పూటనుంచీ తనపేరు పిలువకపోతే ఎంత 'యిది'గా వుంటుందనీ! అందర్నీ పేరుపేరునా పిలుస్తూంటే అంతా 'హియర్ సార్! ప్రెజంట్ సార్' అంటూంటే, తను చిట్ట చివారి బెంచిలో సత్రికాయలా కూచుంటున్నాడు. కుర్రా ళ్ళంతా తనకేసి చూస్తూంటే ఆ చూపులు కుమ్మరి పురుగుల్లా తనమీాంచి పాకుతున్నట్టే వుంటాయ్!

కొత్త పుస్తకాలు స్కూలు స్టోర్సుకి రావడవే తరవాయి, కుర్రాళ్ళంతా వెంటనే కొనుక్కుని అట్టలు వేసుకుని మహా విరగబాటుగా క్లాసుకు వస్తారు. కొత్త పుస్తకాలు! యించ క్కని ఎంత కమ్మని వాసనని!

తనకెప్పుడూ ఎరువు పుస్తకాలే. సెకెండుహేండ్ పుస్త కాలే. ఛ... ఛ... స్కూలు బంట్రోతు సీతన్నగాడికికుండా తను లోకువే!

వేణు చాలా మంచివాడు. అడగడవే తడువు, పాపం, తనకేదడిగితే అది యిస్తాడు. సహం సహం చదువుకోన్నా సరే, పుస్తకం యిమ్మంటేచాలు, చదువుమానుక్కునైనా మాధ వుడికిస్తాడు. వేణు హిస్టరీ చదువుతూంటే తను జాగ్రఫీ, వాడు తెలుగు బుక్కు చదువుతూంటే తను యింగ్లీషూ చదివి సరి పెట్టుకుంటున్నాడు.

మాధవుడి గొంతుక కుంచుకుపోయింది. కళ్ళమ్మట నీళ్లు తిరిగి నోటికి ఉప్పగా తగిలాయి. గుటకలు మింగాడు.

' బర్నింగ్; కాలుచున్న; నౌన్; హ హహఁ! కాదురా బాబూ! కాదూ ... యాడ్జక్టివ్; క్వాలిఫయింగ్‌దీ నౌన్; డెక్; డెక్ ' కళ్లెగరేశాడు. నిద్రతూలుతున్నది. చీపురుపుల్ల తీసి ముక్కులో పెట్టుకుని నాలుగు తుమ్మాడు.

' ఎప్పుడూ యింగిలీషేనా? ' అని ప్రశ్నించాడు తండ్రి.

' మరి పుస్తకాల్లేవ్ ! ఏంచేయమంటావ్ !' బుంగమూతి పెట్టాడు కొడుకు.

' ఏదైనా అంటే ఆతప్పు మనమీదే తోసేస్తాడు వెధవయ్య!'

నర్సమ్మ లోపలకు వస్తూ ' వేణు నీకు బొక్కులీయడం లేదురా! ' అంది.

'స్కూల్లో నా పేరే తీసేశారు! ' మాధవుడి గొంతుక డిక్కపడింది:

' బోయ్స్టుడాన్ది ... యీ ... యి ... యి ... ' కళ్ల నీళ్లలో పుస్తకం తడిసిపోతూంది.

' ఏడుపెందుకురా? '

' ఆడిజీతమేదో పెతీనెలా ఏరేతీసి ఓకాడెట్టరాదా ?'

సాంబయ్య కోడిపుంజులాగ మెడసాచి చూశాడు. గొంతుక ముడి అటు ఇటూ ఆడింది ' అంతా నాసేతుల్లోనే వున్నట్టే టానిందా? '

'ఎధవయిదురూపాయలు మిగల్న నేకపోతన్నాం!' తప్పు యిద్దరిదీ అన్నట్టు నర్సమ్మ మొగుడికేసి చూసింది.

మాధవుడు అక్కణ్ణుంచే 'యీ నెలనుంచీ జీతాలెచ్చించారు' అన్నాడు.

'ఎంతా?'

'అఁరూపాయల ముచ్చవకా!'

'మీా ఎడ్మాస్టర్కానీ మతిపోనాదేట్రా! తాటిపీచులా బుఁరాయిాడూను!'

తనకంటె పెద్దవాడై వుండి జీతాలు ఎవరు హెచ్చిస్తారో తెలియనందుకు తండ్రిని చూసి నవ్వుకున్నాడు.

'మా హెడ్మాష్టరుకేమీా పవర్సులేవ్!'

'అయితే ఎవరా ఎచ్చించావాళ్ళంట?'

'డైరక్టుగా గవర్నమెంటే!'

ఈ నెలనుంచీ ఏడురూపాయలు నెలనెలకీ మిగల్చాలనే సరికి సాంబయ్యకు మతిపోయింది. తన జీతంచూస్తే ఏభై. నెలకు యిరవై రూపాయల బియ్యం; తాలింపుకు నూనె, తలకి నూనె, ఉప్పుగల్లూ, మిరపకాయలు, చిల్లర ఖర్చుల కిరవై రూపాయలు. తనకి టీ ఖర్చుకీ బీడీలకీ పదీ...బాస్... సరిపోయింది. దూబరా ఖర్చు ఎక్కడా కనబడ్డంలేదు.

'నాకు కనక యీా మాయముండా సంసారాన్నీదుకొస్తన్నా'

'పెతిమగోడు అలాగే అనుకుంటాడు. అషుమంటి విషయాలు నా దగ్గిర సెప్పకు. నానేమన్నా దూబరాచేత్తానని నీ ఉద్దాసం?'

'అహాఁ! ఎంతార్జిస్తోన్నా సాలకుండావుందని!'

నిజమే. సాంబయ్య ఎంత ఆర్జిస్తోన్నా చాలడం లేదు. తనెంతో తెలివైనవాడు కనక యీ మాయముండా సంసారాన్ని ఈదుకు వస్తున్నాడు. చుట్టుపక్కల జమీందార్లకీ రైతులకీ తగవులు వస్తాయి. రైతుల పంటల్ని జప్తు చేయించుకు పోతూంటే రైతులు ఎదిరిస్తారు. జమీందారులు ప్రభుత్వానికి కబురు తోలేస్తారు. లారీలు వేసుకుని రిజర్వు పరుగెడుతుంది. ఓ! అప్పుడు చూసుకోవాలి. రిజర్వు దిల్‌కుషీ! మేకపోతులూ, గొర్రెలూ, కోళ్లూ ధుమాధుమా! అల్లరంతా అణచిపెట్టి లారీలలో పట్టణం వచ్చేస్తున్నపుడు దారిలో కనిపించిన ప్రతీ గుడ్డెమీదా ఆగి కనిపించిన పిందెల్ని తెంపుకుంటారు. ఆనపకాయలు, వంగపిందెలు, బీరకాయలు, మిరపకాయలూ, ఏవి కనిపిస్తే అవీ! రైతెవడైనా ఎదురయితే మొల తడివిఁ అవతలకి పంపించడంకూడా కద్దు. ఆడది కనిపించిందా, 'అబ్బ దాని సోకో! జెబ్బల్దాకా జాకట్టు'! ఆ పూట గొర్రెపోతును వేయాల్సిందే!

'ఆణ్ణి రిజర్వులో వేయిత్తా'

'ఎనాగో ఓనాగ ఆణ్ణి ముందు సదివిద్దూ!'

చదవడంమాని చెవులు రిక్కిగించి తండ్రి అనే మాటల్ని వింటున్నాడు. 'రిజర్వు' అనేసరికి మాధవుడి గుండెల్లో రాయి

పడింది. ఛా... వెధవ నౌకరీ... నెత్తిమీద వొకపక్కకు వంగిన టోపీ పక్షవాతంవాడి మూతిలాగ. తుత్! రైలు డ్రైవరుద్యోగమైతేనా ఎంచక్క!

తల్లి 'సదవరా సదువు' అనేసరికి కొడుకు 'ది బోయ్ స్టుడాస్ట్ బర్నింగ్ డెక్' అంటూ చదువుతున్నాడు.

'అస్తమానూ ఆముక్కే సదువుతున్నావ్; ఏట్రా దానర్థం?'

తండ్రి తనను అర్థం అడగడం చూసి ఎంతో సరదా అనిపించి కొడుకు 'కాలిపోతున్న పడవమీద ఆ పిల్లవాడు నిలువంబడెను.'

'ఇదేట్రా యీ సిత్రం! కాలిపోతోన్న పడవమీద నిలబడ్డమేట్రా పారిపోక!' రిజర్వులో చేరాక సాంబయ్య గడించిన అనుభవం అక్షరాలా బయటకు వచ్చింది. నర్సమ్మ పెదవులమీద చిర్నవ్వు వెలసింది.

'నిలబడ్డాడంతే, అంతధైర్యమన్నమాట కుర్రాడికి?'

'అంతధైర్యం ఎక్కడా వుండదురా మాధవా!'

'ఉండదంటావేటి? ఈ యింగిలీసు బొక్కులో రాసుంటే'

'ఏవోయీ సదువులు, మన బుర్రలకి బోదపడవు' అంటూ నర్సమ్మ మగణ్ణి వెక్కిరించింది. సాంబయ్య చుట్ట పొగ గుప్పున వొదిలేడు.

'అదికాదే అమ్మా! తండ్రి తనొచ్చేదాకా వుండమని కొడుకుతో చెప్పేడే. ఈ లోగా పడవ కాలిపోయిందే, తండ్రి

వొచ్చేదాకా కొడుకు అలాగే నిలబడ్డాడు. తండ్రిమాటంటే అంతభక్తన్నమాట కొడుక్కి!'

సాంబయ్య ఏదో అనబోతూవుంటే బారకాసులో బిగిలు వినిపించింది. సగం సగం మాటలంటూ సాంబయ్య డ్రిల్లుకు పరుగెత్తుతున్నాడు. పరుగెడుతోన్న భర్తని నర్సమ్మ 'ఈ ఏల ఎలాగైనా ఆడిజీతం కట్టేయాల' అంది.

---

౨

'ఈ వేళనుంచీ యింక స్కూలుకి వెళ్లక్కర్లేదురా!' అన్నాడు వేణు. మాధవుడికి ప్రాణంలేచివచ్చింది. కాని వేణు మాట నమ్మడానికి వీల్లేదు.

'ఇప్పుడేం సెలవలమ్మా!'

'అంతా మానేస్తే అవే సెలవులూ!'

'వాస్సీ! మానేయడం మనచేతిలోవున్నట్టు!'

'మరింక ఎవరిచేతుల్లో వుందేవిఁటి?'

'అంతా మానేస్తున్నారా?'

'ఎవరూ రారని కృష్ణ చెప్తేనే యిందాకా,

'బడిమానడం దేనికని?'

'జీతాలు హెచ్చించడం మొదటి కారణం'

"నేనింకా జీతవేఁ కట్టలేదూ!'

"మంచిపనిజేశావ్. కట్టినాళ్ళని ముద్దిచ్చారేవిఁటి? అందర్నీ తన్నారు'

'ఎవర్నీ'

'గుంటూరులో స్టూడెంటునా?!'

'పోలీసాళ్ళకి పొగరుగావుండే'

'అందుకే సమ్మె'

'పెద్దకాలేజీ కూడానా!'

'రాత్రంతా లాడ్జి లాడ్జీ తిరిగి పెద్ద పెద్ద బి. ఎ. వాళ్లు బడికిరావద్దని చెప్పేశారు కాదటా?'

'మరి మా యింటికి రాలేదేం?'

'మీ యిల్లు తెలియదేమోలే!"

'అయితే జీతాలు తగ్గించేస్తారన్నమాట?'

'తగ్గించేవరకూ మనం స్కూలుకు వెళ్ళమన్నమాట!'

'హాయ్ హాయ్, హాహాయ్!'

నర్సమ్మ కడిగిన చేపలు దాకలో వేసుకొని వెడుతూ వెడుతూ వేణుని చూసి ఆగింది. 'సేపల పులుసేత్తా. కూంతంతబువ్వ తినరాదటయ్యా!'

"ఛీ" అన్నట్లు వేణు అదోకలా మొహం పెట్టాడు.

'పోనీ వొంజరం ముక్కలు కాసిన్ని కాసిన్నంటే, కాసిన్ని తిను'.

తన తల్లి తన స్నేహితునితో చనువుగా మాట్లాడుతున్నందుకు మాధవుడు సరదాగా నవ్వేడు.

'మీ పప్పుకూడుకన్నా మా సెపెద్ద రుసిగా వుంటదిలే!'

'అయితే పెట్టండి మరి!' వేణు కిలకిలా నవ్వాడు. గాజులు గలగల చప్పుడు చేసుకుంటూ చేతులు తిప్పుతూ నర్సమ్మ 'అమ్మో! మీఅయ్య సంపేయడా?' అంటూ వెళ్లి పోయింది.

'సాయంత్రం పెద్ద కాలేజీవాళ్లు మీటింగులు చేస్తారట'

'ఎందుకూ?'

'అడిగిందే అడుగుతావూ! రా పోదాం!'

'రైలు స్టేషనుకా?'

'కాదు, స్కూలుకి. ఏం జరుగుతుందో చూద్దాం తమాషా'

వేణూ, వాడి వెనకాల మాధవుడూ వృత్తిచేతుల్తోటి బయటకు వెడుతున్నారు. నర్సమ్మ వృత్తిచేతుల్తో వెడుతున్న కొడుకుని చూసి 'పుస్తకాలు పట్టుకెళ్ళవేంరా?' అంది.

'ఈవాళ మా బడికి సెలవే అమ్మా!'

మాధవుడు యీల వేశాడు.

"ఎందుకనీ?"

'మా మాస్టారు చచ్చిపోయారండీ!'

'అయ్యో పాపం!'



## 3

కాలేజి ముందర విద్యార్థులంతా బారులుతీసి నుంచున్నారు. ముందు పెద్ద పెద్దవాళ్లూ తరవాత ఓమాదిరి వాళ్లూ, ఆ వెనక చిన్నవాళ్లూ వరస వరసలుగా రైలుపెట్టెల్లా కదిలి వెడుతున్నారు. అట్టలూ జండాలూ పట్టుకొని ముందున్నవాళ్లు పాడుతున్నారు. మొదటివరసవాళ్లు పాట ఆపగానే వెనకాలవాళ్లు అందుకుంటున్నారు. పాట అంచీలమీద వెడుతున్నది. గాలి పాటను తనతో కలుపుకుని దూరంగావున్న సరుగుడు తోట సంగీతానికి పోటీపడుతోంది. ఊరేగింపు పాటనుమించి పరుగులు తీస్తున్నది. ఊరేగింపులో కృష్ణ అట్ట పట్టుకుని అందరికన్నా ముందే నించున్నాడు. నిక్కరు జేబులో చెయ్యిపెట్టుకుని అందరి గొంతులతోనూ తనూ గొంతు కలుపుతున్నాడు. ఊరేగింపు షరాఫ్ఖానావారి వీధికొచ్చింది. రోడ్డుదుమ్ము బంగారపుపొడిలాగా ధగ ధగమెరుస్తూ ఎగురుతోంది. వేణూ మాధవుడూ రోడ్డువారనే మెల్లమెల్లగా అడుగులు వేస్తున్నారు. నినాదాలు గింగుర్లు తీస్తున్నాయి. జెండాలు రెపరెపలాడుతున్నాయి. కరపత్రాలు గాలిలో పిట్టలకుమల్లే ఎగురుతున్నాయి. ఊరేగింపు సాగిపోతుంది. పాటలతో నినాదాలతో వీధి వీధంతా ప్రతిధ్వనిస్తోంది. కోట గోడలను చీల్చుకుంటూ నినాదాలు తుపాకిగుండుల్లా దూసుకుపోతున్నాయి. కందకంలో కూచున్న మనిషి చిలకట్టు సర్దుకుని గబగబ రోడ్డుమీదకు వచ్చేడు. ఆడవాళ్లు మేడలమీదించి

తొంగి తొంగి చూస్తున్నారు. కుర్రివాళ్లు గర్రిగా ముందుకు పోతున్నారు.

ఊరేగింపు పోస్టాఫీసుదాకా వచ్చి సాగి సాగి మూడు లాంతర్ల స్తంభంవరకూ జరిగి గల గల మంటున్నది. సెలయేటి పాయవలె వడులతో మళుపు తిరిగింది. పెద్దబజారు; సముద్ర మంత బజారు కేసి అడుగులు వేసింది. జయ జయమని బజారంతా అరుస్తోంది. చొక్కాకుట్టే దర్జీవాడు మిషనాపి తొందర తొందరగా వరండాలోకి వచ్చాడు. సెలూన్‌లోంచి వొక ముసలాయన గడ్డంనిండా సబ్బునురగతోనే రోడ్డుమీదకువచ్చి రెండు చేతులతోనూ నడ్డి పట్టుకుని మెడ పొడగించి మరీ పరి కిస్తున్నాడు. ఆయన్ని వెంబడిస్తూనే మంగలికత్తి నూరుకుంటూ తోసుకు తోసుకు వచ్చాడు. గంటస్తంభం ఎపుడూ వొకటే గంట. చీమలబారులా ఊరేగింపు సాగిపోతోంది. ఊరేగింపులో కృష్ణ 'విద్యార్థుల మహాసభ! బహిరంగసభ. ప్రముఖుల ఉప న్యాసాలు' అంటూ మెగఫోనులో అరుస్తున్నాడు. బజారు గగ్గోలుగావుంది.

మాధవుణ్ని మోచేత్తో పొడుస్తూ వేణు 'చూడు చూడు కృష్ణగాడూ!' కృష్ణుడు వేణుని చూశాడు. వేణు కొంచెం దగ్గర పడేసరికి చొక్కా పట్టుకొని వొక్కలాగు లాగి ఊరేగింపులో కలిపాడు.

వేణు అట్టపట్టుకున్నాడు. మాధవుడు వాడి వెనకాల నిలబడ్డాడు. ఊరేగింపు గల గలమంటూ గజ్జలమ్రోతలు పెడుతోంది.

కేగతోట కూరకాడ భుజాన వేసుకొని ముసలాయ నొకడు 'ఎంత హుషారీ కుర్రాళ్లకి' అన్నాడు. పక్కనే వున్న జట్కావాడు కమ్చీ ఎగరేస్తూ 'రైటో రైట్ !' ఏటి సేసినా యీ టూడెంటు కుర్రోళ్లే సెయ్యాలయ్యా' అని భుజాలెగ రేస్తున్నాడు. ఊరేగింపులోకల్లా 'పోలీస్ జులుం నశించాల'న్న కేక వాడికి బాగా నచ్చింది. 'తుత్, పోలీసు నాకొండెలు !'

'హాసి తస్సాగొయ్యా ! ఎంత పొసెసన్నగ దీసినారు!' అంటున్నాడు మిల్లుకూలీ. ఊరేగింపు రబ్బరు తాడులాగా జరిగి పోతోంది.

గంటస్తంభం దగ్గరకొచ్చేసరికి ఊరేగింపుకి బ్రేకుపడింది. మాధవుడు ఊరేగింపెందు కాగిందోనని వేళ్లమీద నిలబడి తల ముందుకు సాచి చూశాడు. జరిపోతులా రెండువేన్లు వచ్చి నిలబడి వున్నాయి. వేణు నినాదం యిస్తూనే వున్నాడు. తాను యిస్తున్న నినాదాలను పెద్దపెద్ద బియ్యేవాళ్లు అందుకుని తన ఆజ్ఞ పరిపాలిస్తున్నందుకు వాడికెంతో హుషారుగా వుంది. పోలీసులు వేనుదిగి నలుపక్కలకూ ఊరేగింపును చెదర గొడు తున్నారు. నినాదాలు, జై జై నినాదాలు గిలిగిచ్చకాయల్లా గల్లుగల్లు మంటున్నాయి. మాధవుడి పిల్లిగొంతుక పెగలడం లేదు. కృష్ణమూర్తం 'పోలీసు జులుం నశించాల'ని కేక వేశాడు. ఊరేగింపందుకుంది. మంత్రోచ్చారణలాగ నినా దాలు వినిపిస్తున్నాయి.

'నూటనలభై నాలుగూ ! డిస్పర్స్ ! డిస్పర్స్'

ఊరేగింపు పాదరసంలా ప్రవహిస్తున్నది. ముందూ వెనకా లారీలు చుట్టుముట్టాయి. భయంతో మాధవుడు గజ గజ వణికి పోతున్నాడు.

'ఊరేగింపాగదు'

'ఇంక్విలాబ్!'

'జిందాబాద్!'

లారీలు ఎగురుతున్నాయి. మాధవుడి ప్రాణం గుటుక్కు-మంటున్నది.

'పారిపోదాం రారా' మాధవుడిమాట వేణు వినిపించు కోలేదు. ఊరేగింపు నాలుగు పాయలుగా చీలిపోయింది. చిన్న కుర్రాళ్లు పరిగెత్తుతున్నారు. వీధుల్లో బూట్లచప్పుడు వినిపిస్తున్నది.

ఊరేగింపు సందుల్లోకి మళ్లి మళ్లీరోడ్డుమొగను కలుసుకుంది. వేణు నినాదాలిస్తూనే వున్నాడు. మాధవుడు చల్లగా కిళ్లీషాపు బడ్డీకిందకి తప్పుకో గల్గాడు. కృష్ణుడు జండా పట్టుకు ఊపుతున్నాడు రైలును కదలమని గార్డు జండా వూపుతున్నట్టు! ఊరేగింపు కదిలింది.

మాధవుడు గబ గబ కాళ్లకి స్పీడెక్కించాడు; పరుగెత్తి పరుగెత్తి వొగర్పుకింక ఆగలేక 'హమ్మ' అంటూ నిలబడిపోయాడు. వేణు తనతోకూడా పరుగెత్తుకొచ్చేడేమోనని ఆతృతగా నలుదిక్కులా కలయచూశాడు. వేణు కనబల్లేదు!

దూరంగా కోలాహలం. అడుగులధ్వని, గొంతుకలు, నినాదాలు, లారీలపరుగు, పోలీసులఈలలు, భయం భయంగా మాధవుడు చూస్తున్నాడు.

రెండుసార్లు తుపాకీ పేలిన చప్పుడు. ఇంకొకసారి. మళ్ళీ వొకమాటు. తిరిగి ప్రేలుడు. గుండెనీరై పోతోంది!

వేణుకు తుపాకీ తగిలివుంటుంది. తనతో 'పరుగెత్తరా బాబూ' అంటే వినిపించుకోలేదు. ఈడుపుకాళ్ళతో సందమ్మట నడుస్తూ మాధవుడు బిక్కచచ్చిపోయి బావురుమని యేడుస్తున్నాడు. మసీదు వచ్చింది. బజారులోని జనం పరుగెత్తుతున్నారు. విద్యార్థులు, నినాదాలిస్తుంటే వేను పోతున్నది. జయ్‌మని రొదచేస్తూంది. పోలీసు వేను వొక ఊరేగింపులావుంది. దౌర్జన్యం నశించాలని కేకలు!

కళ్ళెగరేస్తు జట్కావాడు కొరడాకర్ర విదిలించాడు. 'ఎంతన్నేయం!'

'నిక్షేపంలాంటి కుర్రాడయ్యా. నిష్కారణంగా ... దారుణం!' అన్నాడు గుమాస్తా.

'ఈళ్ళకి మతిపోనాది సార్!'

మాధవుడు కొయ్యబారిపోయి అలాగునే నించున్నాడు. వేణు కోసం మళ్ళీ చూచాడు. చూపులు కాస్త దూరం వెతికి మళ్ళీ తన దగ్గరకే వచ్చాయి.

వేణు యెంత మంచివాడు! తనను పిలవకుండా ఎక్కడికీ వెళ్ళేవాడు కాడు. తనూ వాడూ వొక్క బెంచీలోనే కూచునేవాళ్లు. కృష్ణ మరీ మంచివాడు. మాస్టారు ప్రశ్నలు వేసేవారా, తనకు సమాధానం తెలియక క్లాసులో పేలిపోకుండా జవాబు మెల్లిగా అందిచ్చేవాడు! కృష్ణకి పాపం తనకిలాగే జుబ్బాలన్నీ చిరుగులు. వేణు యిస్తానన్నా పుచ్చుకునే వాడే కాడు. 'వున్నాయిలేరా'

'నేనిస్తే పుచ్చుకోకూడదేంటమ్మాత్ !' 'ఒట్టమ్మావొట్టు. చాకల్ది రేపు తెస్తుందిగా.'

పడవ. కాలిపోతోన్న పడవ. మంటలు-!మధ్య అలాగే నించున్న కేసబియాంకా. తను కేసబియాంకా పద్యం చదువుకుంటుంటే 'కాలిపోతూంటే పారిపోక అలా నిలబడడమేట్రా ?' అన్నాడు తన తండ్రి. 'అలాటి ధైర్యం ఎక్కడా వుండదురా!' అన్నాడు పైపెచ్చు.

అవును. అలాటి ధైర్యముంది. కొడుతోన్నా, పట్టుకున్న జండాలు వదల్లేదు. నినాదాలు వినిపించడం మాన్లేదు.

జీతాలు కట్టలేక అమ్మా నాన్నా యిబ్బంది పడుతున్నారు. ప్రతినెలా తనపేరు స్కూల్లోంచి తీసిపారేయడమే మాస్టరుగారు! వేణుపేరు యెప్పుడూ తీయనే లేదు. జీతాలు నెలనెలకూ కట్టేవేణు ఊరేగింపుకెళ్లాడు. తనకి వేణు పుస్తకాలివ్వడమేకాదు. చాకులెట్లు కొనిపెట్టడమే కాదు. తుపాకీ దెబ్బలు తిన్నాడు. అబ్బే ! వేణుకి తగిలివుండదు తుపాకీ !

మాధవుడి కళ్లల్లో నీళ్లు తిరిగాయి. ఎదురుగా కంటినీళ్ల మధ్య వేణూ, కృష్ణా నించున్నారు. కళ్లు నులుపుకుని చూశాడు. అంతా వుత్తిదే !



ర

'ఉట్టి ఎదవపనే' అన్నాడు అన్నంముద్ద ఎగరేస్తూ సాంబయ్య.

'ఏటాపనీ ?' అంది పొంజరం ముక్కలు వడ్డిస్తూ నరసమ్మ. తను ఊరేగింపు కెళ్లినట్లు తెలిసిందేమోనని మాధవుడి గుండె బితుకూ బితుకూ మంటోంది. పుస్తకంతీసి చదువు కుంటున్నట్లు నటిస్తున్నాడు.

'అసలు నాకా కుర్రాణ్ని కాల్చాలనిలేదు !'

'ఎవర్ని ? '

మాధవుడి గుండెలో రాయిపడింది.

'ఏమోకానీ ... వేణులాగే వుంటాడు !'

తుపాకీదెబ్బ వేణుకి తగల్లేదు. మాధవుడు తనను తాను సముదాయించుకున్నాడు.

'అసలీ స్ట్రయికెందుకు చేశారా?'

'జీతాలు పెంచాలని'

'మంత్రిలయాక కాంగ్రెసోళ్లుచేసిన నిర్వాకమేయిది?'

'ఆళ్లుకాల్చమంటే మీరెలా కాలుస్తారయ్యా?'

'మొత్తంమీద ఎవణ్నోవొకణ్ణి కాల్చడం తప్పడంలేదే!'

మొగుడి కంచంలో పులుసుముక్కలు వడ్డించింది. పర ధ్యానంగా తింటున్నాడు సాంబయ్య.

'కూడుకి రారా'

మాధవుడికి కూడు తినాలనిలేదు. బాబు తింటున్న అన్నంకేసిచూస్తే ఆ అన్నపు మెతుకులు పురుగుల్లా పాకుతు న్నట్లు కళ్ళముందు మెదుల్తున్నాయి.

'తింటాన్లే బాబుని తిననీయ్'

సాంబయ్య యిదేమీ వినిపించుకోకుండా 'కొడుతున్న కొద్దీ రెచ్చిపోతున్నారు' అన్నాడు.

'రెచ్చిపోక మరి!'

'కాలేజి కుర్రాళ్ళని కొట్టామంటే మిల్లుకూలీలు బయల్దేరారు!'

'హాఁ'

'దుకాణాలన్నీ మూసేశారే!'

ముదిరిపోద్దన్నమాటే!'

'గుర్రపు బళ్ళోళ్ళ సమ్మె'

'ఇంక నువ్వింటిపట్టున వుండవన్నమాట'

'అంతా మనోళ్ళే. ఏటికాల్సనా?'

నర్సమ్మ ఏదో అనబోతూంటే బయట ఏదోగోల వినిపిస్తోంది.

' ఏట్రా ఆగోల ? ' అన్నాడు సాంబయ్య.

మాధవుడు చెవులు రిక్కగించివింటున్నాడు. బయట సముద్రంలా హోరు. కోలాహలం. నినాదాలు; తను యిందాకా అరిచిన నినాదాలు ! గాలి తనలో ఆ నినాదాలను కలుపుకుని యిటే వస్తోంది.

' ఇంక్విలాబ్ '

' జిందాబాద్ '

ఊరేగింపు దగ్గిరపడినట్లుంది. తన చెవుల్లో ఊరేగింపు గింగురుమంటున్నది. ఎవరో అరుస్తున్నారు. ఒక గొంతుక వేరు గొంతుకే అచ్చం. అవును. ముమ్మాటికీ, ముచ్చం

ముమ్మాటికీ అదే! అనేక గొంతులు అందుకుంటున్నాయి. గుండెల్లో జయభేరి మ్రోగించినట్లు గొంతులు!

'నువ్వుమాత్రం పయికెల్లకురోయ్' 'సదువుకోరా సదువుకో'

మాధవుడు హిస్టరీనోట్సు తీశాడు. వేణుదస్తూరి ఆడపిల్ల దస్తూరీ!

ఊరేగింపు చాలా దగ్గరసా జరిగింది.

'ఏట్రా ఆసణుగుడూ?'

'పైకి సదవరా సదువు!'

ఊరేగింపు చాలా దగ్గరసా జరిగింది.

'ఇంక్విలాబ్'

'జిందాబాద్'

మాధవుడు వెక్కి వెక్కి యేడుస్తున్నాడు. పుస్తకంలో ఒక్కొక్క బొట్టే జల జల రాలిపడుతోంది. అక్షరాలన్నీ అలికేసినట్లున్నాయి. అవికూడా కన్నీళ్లు కారుస్తున్నట్లు కరిగిపోతున్నాయి. హిస్టరీబుక్కులో రాసుకున్న ప్రశ్నలన్నీ చెరిగిపోతున్నాయి. ఊరేగింపు చాలా దగ్గరసా జరిగింది.

ఏడవకురా! జీతం రేపిచ్చేస్తాలే!'

మాధవుడు వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు. మధ్య మధ్య చెక్కుతున్నాడు. ప్రశ్నల్నీ సమాధానాల్నీ చదువుతున్నాడు.

'సిపాయిల తిరుగుబాటుకు... తిరుగుబాటుకు... కు... కారణ... మేమి?' 'సిపాయిల తిరుగుబాటుకు కారణమేమనగా... ఏమనగా... ఏ...'

బయట బారకాసునుంచి బిగిలి వినిపించింది.

'ఏటా్రి ఆ బిగిలు' అంది నర్సమ్మ. సాంబయ్య బయటకు దౌడు తీస్తున్నాడు.

'ఎవర్నీ కాల్సకు. నీ పుణ్యముంటుంది.'

ఊరేగింపు చాలా దగ్గరసా జరిగింది.

'సదవరా సదువ్రా'

'అసలే సహనమును గోల్పోయిన... గోల్పోయిన సిపాయిలకీ వార్త... వార్త... అగ్నికి వాయువుతోడై... నట్లాయెను!'

మాధవుడు చదువుకుంటున్నాడు. బయట గొంతుకలు. జయభేరి లాటి లాటి గొంతుకలు!

మాధవుడు చదువుకుంటున్నాడు.

ఊరేగింపు చాలా దగ్గరసా జరిగింది. ఉత్సవంలాటి ఊరేగింపు! దేవతల ఊరేగింపు!



# అన్నయ్యా వెళ్ళినదారి

వావిలాల వారమ్మాయ్! యెంత బాగుంటుందనీ! ఏడు రంగుల చీర కట్టుకుని నీలిరంగు రవికె వేసుకుని గదిమూల కూచుని పాడుతూంటే ఆకాశంలో హరివిల్లు వేసినంత సుందరంగా వుంది!

తలకు తళతళలాడే రిబ్బనూ మల్లెపూవంటి శరీరం. అన్నయ్యాకాపిల్ల నిస్తామంటూ వచ్చారు. చూసుకుందుకు వెడుదుంకదా వీణమీద త్యాగరాజు కృతులు పాడింది. నొక్కు నొక్కుల జుత్తులాగవుంది పాట. సన్నంగా పాడుతూంటే ఆకాశమూలల నుంచెవరో సన్నాయి వాయిస్తున్నట్టే! మా వంక చూస్తుంటే మల్లెపూలు మీద జల్లినట్లయింది!

నాన్న 'నీపేరెవరమ్మా?' అంటే 'ఇందిరండీ!' అని మెల్లగా అంది. గట్టిగా అంటే కందిపోతుంది. సోగకళ్లూ... ...చెవులికి జూకాలున్నూ! అటుఇటు తచ్చాడింది. చూశాం కదా పువ్వులమీదనుంచి నడిచినట్టయింది. పిల్లనుచూసి అన్నయ్యా మతి పోగొట్టుకొని వుంటాడు. ఎన్ని సంబంధాలొచ్చినా అక్కర్లేదనే జవాబు!

ఈ సారి వావిలాల వారిపిల్ల తాజ్‌మహల్‌వంటి మాయింట్లో నెమలిసింహాసనం! అన్నయ్యా షాజహాన్ !

మండపేట సమ్మంధం వొద్దన్నాడన్నయ్యా. దీర్ఘాలు తీసుకుంటూ అతనెలాగైనా అన్నయ్యని వలవెయ్యాలని గందర గోళం పడ్డాడు. పిల్ల జావి(పండు చాయట. వొడ్డూ పొడుగూ జబరుగా వుంటుందిట. పిల్ల బామ్మపేరున పాల్తోడు భూములు నాలుగెకరాలున్నాయట. బామ్మనంతరం ఆమాగాణీ పిల్లకే సంక్రమిస్తుందట... అట అట అటా... చాలా చెప్పుకొ చ్చాడు! పాపం!

ఎన్ని సంబంధాలొచ్చినా అవన్నీ బిళ్లలంటించని ఉత్త రాల్లా అన్నయ్య తిరగ్గొట్టేసేవాడు. నాన్న 'పెళ్లి వొద్దం టావేం ఖర్మరా?'

'ఎందుకు నాన్నా నామెడకో గుదిబండ?' నాన్న 'పెళ్లీ పెడాకులూ లేకపోతే ఎలాగరా?'

అన్నయ్యా పెళ్లిమీద పెద్ద సిద్ధాంతం; రాద్ధాంతం! సాంఘిక ధర్మాలన్నీ స్త్రీని బురదగుమ్మిలో పొర్లేటట్టు చేశా యట! అవన్నీ జ్ఞాపకంలేవు కానీ, అన్నయ్యా నాన్నా పోట్లా టల మధ్య దొర్లిన మాటలు ఇంకా గుర్తుకొస్తున్నాయ్!

వివాహ సంస్థ కొలతలిస్తే సరఫరా చేసే గొడారికొట్టు అనీ 'ఆదిస్తే' జుబ్బాలను కుట్టేమిషన్ అనీ అన్నయ్యా. ఆడది పువ్వు కాదు వాడిపోతే పారేయడానికి. మనుష్యుల్ని ఉపయోగించు కుని అటుతరువాత తన యిష్టమొచ్చినట్టు చేస్తానంటే అన్యాయం. మనుష్యులు మెషిన్లుకారు. మనుష్యుల్ని మెషి

న్లగ మార్చేకాలం యిది. మెషిన్లను మనుష్యులుగ మార్చే కాలం వస్తుంది!

అన్యాయ్యాలా నాకూ వాదనలొస్తున్నాయే! అందుకే నాన్నకి అన్నయ్యంటే గంగవెర్రెత్తుతుంది. అందరి సావాసం వల్ల అన్నయ్య చెడిపోతున్నాడని తెంచిన జంజ్యాన్ని మళ్లీ వేయించాడు. ఆస్తిపాస్తులేవీ ముట్టజెప్పనని హడలెత్తించి ఆ పుస్తకాలు చదవకుండా చేశాడు. నాకింకా లీలగా జ్ఞాపకం. లీలగాయేం! అన్నయ్య రోజూ యింటికి ఆలస్యంగా వచ్చే వాడు. వేళపట్టున తిండితినేవాడు కాడు. మాసిన బట్టలు మార్చుకునేవాడు కాదు. రాత్రిళ్లు ఎప్పుడొచ్చి పడుకునే వాడో మాకెవరికీ తెలిసేది కాదు!

నాన్నకేదో అనుమానం పీకింది. ఆరాత్రి ఆడదానిలా గుండె బాదుకున్నాడు. లారీమిట్టిన ఆవులాగ బావురుమన్నాడు. సబ్ యినస్పెక్టరు అన్నయ్యని భయభక్తుల్లో వుంచుకోమని తనతో చెప్పాట్ట! యింకేముంది, నాన్న గొడవకు అంతులేదు. 'సీనించేనే వాడికింత కొమ్ములొచ్చాయ్' అన్నాడు అమ్మని. పోలీసువాళ్లు అన్నయ్యను ఫోటో తీసుకున్నారుట. అట్టు గుట్టు ఆనవాళ్లతో అన్నయ్య ప్రతిరోజూ యేం చేస్తున్నదీ రాసేసు కుంటున్నారట!

అన్నయ్య యేమిటేమిటో అంటాడు. నాన్న మాని తేనా? చిన్నప్పుడు అన్నయ్యకి జ్వరంకాస్తే మిరియాల కషా యమూ అవీ తనే యిచ్చాట్ట! రోజూ ఎండలో చచ్చిచెడి

స్కూలుదాకా దిగబెట్టి 'దాహంవేస్తే మంచినీళ్లు తాగ నోయ్!' అని మరీ మరీ చెప్పి పంపించేవాడుట!

నాన్న యివన్నీ ఏకరువుపెట్టి "నన్నే తొలాయించేస్తా వుట్రా? చిన్నంత్రపూ, పెద్దంత్రవూ వుండక్కర్లేదూ?" అన్నాడు. వెర్రిసాద!

అన్నయ్య ఆలోచనగల ఉద్రేకం. నాన్న ఆలోచన లేని ఉద్రేకం. పెళ్లిచేయకే యిలా ముదిరిపోతున్నాడని చివ రకు వావిలాలవారి సమ్మంధమే స్థిరపరిచాడు. అన్నయ్యకీ నచ్చినట్టుంది! నచ్చదూ? గులాబివంటి పిల్ల. కట్నానికేందగా లేదు.

ఒదినొస్తుంది వొదిన! 'వొదినా వొదినా వొల్లంగి పిట్టా' అని ఉడికిస్తానించక్కా -!

ఒదినొస్తుంది వొదిన! అన్నయ్యనీ వొదిన్నీ మేడూరి వారికోడలికి చూపించి 'యెవరు బాగున్నారో'? అని అడుగు తాను!

ఒదినొస్తుంది వొదిన! మంగళహారతి పళ్లెంలో నూట పదహార్లూ పడవలసిందే, కాళ్ల కడుగు పళ్లెంగూడా నాదే! ఆఁ! మారే; వెర్రిదాన్నేవిఁటి నేను! అక్కయ్య కియ్యాను! పానకం బిందే నాదే!

అన్నయ్య గడుసు బాబూ! వొకంతకి ఎటూ తేలడు. నచ్చింది నచ్చిందని జెప్పడానికి మొహమ్మాటం! 'ఆడపిల్లలా

అంత మొహమాటమేమిట్రా నీకు ?' అంది అమ్మ. 'నే నొద్దంటూంటే నాన్న కెందుకమ్మా అంత తొందర !'

'తొందర కాదుట్రామరీ ! కొడుకునీ కోడల్నీ చూసుకుని సంసారం దిద్దుకోవాలని నాకుమాత్రం వుండదట్రా ?'

గదిలో కూచుని రాత్రి అన్నయ్య చదువుకుంటున్నాడు. బయట వీధి చివర్న కుక్కలు మొరుగుతున్నాయి. మాదాకబళంవాడు మా ఇంటివేపే వస్తున్నట్టుంది. అన్నయ్య చదువుకుంటున్నాడు. అమ్మ వెళ్లిపోయింది. మాదాకబళంవాడు మా ఇంటికే వచ్చాడు. అమ్మ పిల్చింది. అన్నం పెట్టింది. కిటికీలోంచి బయటకు చూశాను. చుక్కల ఆకాశం పేదపిల్ల కట్టుకున్న చింకి పరికిణీలాగుంది ! 'అన్నయ్యా, అదిగో అరుంధతీ నక్షత్రం. ఆనక కనబడదు. ఇప్పుడే చూడన్నాను. అన్నయ్య పుస్తకంలోంచే నవ్వేడు.'

'నవలలో కథకి నవ్వొస్తోందా ?' అన్నయ్యేమీ మాట్లాడలేదు. అన్నయ్య గడుసుబాబూ ! వాళంతకి ఎటూ తేలడు' నచ్చింది నచ్చిందని చెప్పటానికి మొహమ్మాటం ! గదిలో ముంగిలా కూచుని మూసిన పెదవి తెరవడు !

కంగించి చూద్దామని అడిగాను 'పిల్ల నచ్చిందీ ?'

'పెళ్ళిచేసుకోమంటావ్ ?'

"నేన్చెబితే పెళ్ళిచేసుకుంటావేం ?'

'మరి నాన్న కుదిర్చేసేడురదూ !'

వావిలాల వారమ్మాయ్ ! నిక్షేపంలాంటి పిల్ల ! కడిగిన ముత్యం. నచ్చదూ ? అన్నయ్య పెళ్ళికి అంతా వస్తారు.

రంగమ్మత్తా, వరహాలుపిన్నీ చిక్కసం పచుతారు; చిక్కసం- ఇంటింటికీ చిక్కసం !

అన్నయ్య కిటికీమూసి చదువుకోడం మొదలెట్టాడు. మళ్ళీ నెల యీరోజుకి అన్నయ్య బుగ్గకిచుక్క, కాళ్ళకు పారాణి, ఊం ! రాయించుకోడు ! వోడుక్కీ అలాగే ! పిల కలు చేయించరా అంటేనూ, క్రాపింగులో నాలుగు పుంజీల వెంట్రుకలే తీయించాడు !

అర్ధరాత్రి ఎందుకో కాని మెళుకువ వచ్చింది. మా ఇంటి వెనకాల ఎప్పుడూగోలే ! మేదరముండాకొడుకు గూని గాడిద ! రోజూ తప్పతాగిరావడం, అకారణంగా భార్యజుత్తు పుచ్చుకుని బర బరా లాగడం, ఈడ్చీడ్చి తన్నడం, మేదర గూడెమంతా గోల !

లేచి అన్నయ్య గదిలోకి వెళ్ళాను. యింకా చదువు కుంటూనే వున్నాడు. ఎప్పుడూ అంతే! చదువు ! చదువు ! చదువుల గుడిపూజారి! గుడిలోదేవత వావిలాలవారమ్మాయ్ ! ఎదిగిన పెళ్లాం సముద్రకెరటంలాముంచు కొస్తుంటేసరీ, చదువూసంధ్యా కోటాకేస్తుంది.

పువ్వులుకొని 'తలలో తురమంకీ' అంటే నాజూకులో పడి లోకమే మర్చిపోతాడు. వావిలాలవారు ! అబ్బో ! చాలా పేరు ప్రఖ్యాతులార్జించుకున్నారు. పోలీసులైన్‌లో కీర్తికి కీర్తీ, డబ్బుకు డబ్బూవుంది. నాన్న ఉద్యోగస్థుడుకాడు కనక అన్నయ్య అలాదబాయిస్తున్నాడు. పెళ్లాం అంటూవచ్చాక పిల్లలూ సంసా రాలూ ! ఈ వెర్రి మొర్రి వేషాలిక కుదరవ్ ! నాన్నకీ సంగతి

తెలియదు కనకనా ? తెలిసే కుదిర్చేదు నిక్షేపంలాంటి సమ్మంధం !

నాకు పెళ్లయితే ... అమ్మో ... అమ్మనీ నాన్ననీ వొదిలిపెట్టి... పెద్ద పండుక్కి వొదినెతో సమానంగా చీరెలు కొనిపెట్టమని పేచీ పెడతాను. పుట్టింట్నుంచి వొదినే నేమిటి తెచ్చుకుంటుంది మహా ! ఆ! ఇంటాడపడుచుకి పెట్టక అన్న య్యకే నేమిటి అంతా !

అన్నయ్య దగ్గరికి పాఠానికి వెడతాను ! పాఠం చెప్పడం కొంచెం... పై విషయాలే అన్నీ. నాకేం బోధపడవు బాబూ ఆమాటలు ! నవ్వుతారెవ్వరైనా వింటే; అన్నయ్య మాటలన్నీ ఎక్కడైనా నిజమవుతాయీ ? ఓస్సి ! ప్రపంచంలో అంతా సమానంట. బీదాసాదా వుండకూడదుట. హెచ్చు తగ్గులు పోవాలిట ! అన్నీ టటాలే !

అన్నయ్య పెళ్లి కిష్టపడ్డాడని అమ్మా నాన్నా మురిసి పోతున్నారు. అమ్మ ముక్కలు వేయిస్తోంది. పొట్లపాదు చివర నాన్న కుర్చీలోకూచుని చుట్ట కాల్చుకుంటున్నాడు. వేపచెట్టు మీంచి నామలాగ జారుతోన్న వెన్నెలపాదుమీద వేపచెట్టు నీడను అచ్చుకొడుతోంది. నూతి అంచుమీద తెల్లని కత్తి అంచులాగ మెరుస్తోంది వెన్నెల. పొట్లకాయలు పాముల్లాగ వేళ్లాడుతున్నాయి. నాన్న చుట్టచతలవిసిరేసి.

'వాడికా తిరుగుబాటు పెళ్లికాకేసుమా !' అన్నాడు.

' సత్తెకాలం పోనిద్దురూ ! '

'పోయేకాలం ...... ఆ ఎదిరించడం చూశావా ! '

'ఎదిరించాడు! ...పూరుకుందురూ మీారు మరీను!'

అమ్మకి అన్నయ్యంటే చాలా అభిమానం. నాన్న సర్కస్‌కి డబ్బులివ్వకపోతే అన్నయ్యకిచ్చి 'పెరటి దారినిరా' అని సలహా యిచ్చేది. అన్నయ్య తాత పేరింటివాడు!

'ఖర్చులో ఖర్చు... దానికూడా ఏదైనా సమ్మంధం కుదిరితే బావుండునే!'

'బాగానే వుండును!' అని అమ్మ సాగదీసింది మాటల్ని.

'పోనీ మానర్సమ్మకొడుక్కి యిచ్చేద్దామా యేమిటి?'

'నయం. నయం! మాల మట్టేల్లా మొహంవీడూను!' ఇక అక్కడ నేనెందుకు నిలబడ్డం అని వెళ్ళిపోయాను.

పెళ్ళికింకా నెల్లాళ్ళవ్యవధుంది. అయినా నాన్న తొందర చెప్పలేం. ఇంటికి సున్నం వేయించాడు. నూతిగట్టు బాగు చేయించాడు. చీడీ సిమ్మెంటు చేయించాడు. పుల్లలు కొట్టించాడు. చిన్నాన్నగారింట్నుంచి గాబులూ, గంగాళాలూ, గోకర్ణాలూ తెచ్చాడు. పట్నంవెళ్ళి బట్టలుకొనాలంటున్నాడు.

నాన్నెపుడూ యింతే! ఏడాది వ్యవధున్నాసరే యిప్పట్నుంచీ జాగర్తే. పనయ్యేదాకా నిద్రపోతే వొట్టు. కోర్టు యీారింగు నెలరోజులుండసగా ముందే ప్లీడరుతో అన్నీ మాట్లాడివచ్చేవాడు. రైలు పన్నెండుగంటల కొస్తుందంటే ఆరుగంటలకే బయలుదేరేవాడు. 'ఇంకా తెమలవేమే! తెమలమంటే ... వోహోహో! నీకోసం రైలుంటుందను కొన్నావేమిటి?' అని అమ్మను వొకటే తొందర. రాత్రల్లా

జాగరమే!' మరచెంబు తెస్తున్నావా, బోషాణానికి తాళం వేశావా, పిల్లాడికి మందుపొట్లాలు పట్టుకున్నావ్ కద!'

'తెస్తున్నానండీ మహాప్రభో! మీకెందుకొచ్చిన ఆడ సొద! అని అమ్మ.

పొద్దున్నే అమ్మ కాఫీ అన్నయ్యకిచ్చిరమ్మంది. వేడి వేడి కాఫీ పట్టుకుని అన్నయ్య గదిలోకి వెళ్ళాను. అన్నయ్య కనబడలేదు. ఇల్లంతా వెతికినా పిలిచినా అతీ గతీలేదు. డ్రాయరులో పెన్నుకోసం చేయిపెడితే అన్నయ్య రాసిన ఉత్తరం చదువుదునుకదా వొళ్లు ఝల్లుమంది. నిండా పూసిన చెట్టును కదిపితే రాసిపడిన పూలవలె నాభావాలన్నీ చెదిరి పోయాయ్.

గతంలో మానవకుటుంబం నలిగిపోయింది. భవిష్యత్ గొప్పది కావాలంటే ఇప్పుడే జాగ్రత్తవహించాలిట! వివాహం, కుటుంబం, దేశం మహత్తరమైనవి. ప్రధానమైనవి... అనవస రంగా నాపెళ్ళి ప్రయత్నాలు చేయకండి. ఇలాగే ఉత్తరం రాశాడు. అక్షరాలన్నీ ముద్దయి ఆముద్దే అన్నయ్యగామారి ఎదుటకొచ్చి 'కన్నీళ్లెందుకని' అడిగినట్లయింది. అన్నయ్య లేడు. గదిలో కుర్చీ దిగులుగావుంది. బీరువాలో పుస్తకాలు వెల వెల బోతున్నాయి!

నాకింక పాఠాలు చెప్పేదెవరు? చాలా సందడిగా వుండేది. అన్నయ్య యింట్లోవుంటే పదిమందిపెట్టు. ఎన్నెన్నో విషయాలు అన్నయ్య చెప్పేవాడు. నాకు చదువెందుకంటే

అన్నయ్యే పట్టుపట్టి చదువుకోవాలన్నాడు. విజ్ఞానం మానవ సంకెళ్లు విదిలించి ముందుకు నడిపిస్తుందని అన్నయ్య!

ఎన్నెన్నో రిబ్బన్లూ పువ్వులూ తెచ్చేవాడు. అన్నయ్య చేసిన తప్పు కనబడదు. ఇల్లు వదలి ఎందుకు వెళ్లిపోవాలి?

అమ్మ పాలుపితుకుతోంది. నాన్న పెయ్యని పట్టుకుని గొంతుకూర్చున్నాడు. వేపచెట్టుమీంచి జారుతోన్న నీరెండ పొట్లపాదుమీద పడుతోంది. సగంసగం పండిన పొట్లకాయ ఎండలో ఎంత బాగుంది! దూడను వొదుల్తూ నాన్న 'పోనీ... ఎలాగా తలపెట్టాం. దాన్ని మానరసమ్మ కొడుక్కి కట్టబెట్టేద్దామా?'

'ఊరుకోండూరుకోండి! వింటే ఉరిపోసుకు చస్తుందది!'

నూతికెడుతూంటే అమ్మా నాన్నా మాట్లాడుకుంటు న్నారు. నేనెందుకు ఎదట పడ్డమని అన్నయ్యగదిలోకి వెళ్లి పోయాను. అన్నయ్యవుంటే ఎంతబాగుండును! 'అనవసరంగా నా పెళ్ళి ప్రయత్నాలు చేయకండి' అన్న అన్నయ్యమాటలు చెవిలో వినిపించాయి. ఉత్తరం జ్ఞాపకమొచ్చింది. కళ్లలో నీరు గిర్రున తిరిగింది!

♦ ♦ ♦ ♦ ♦ ♦

పరీక్ష పేసయ్యేనని వింటే ఎంత సంతోషించును! ఒక్క సారింటికొస్తే బాగుండును. 'పోనీ అలాగున్నా బాగుండేదే' అంటాడిప్పుడు నాన్న.

అన్నయ్యదృష్టి ఇటు లేనేలేదు. భూమి ఆకాశం కలుసు కునే చోటికి అన్నయ్య ప్రయాణం. ఇంటర్మీడియట్ క్లాసు

కొచ్చాక ఆనాటి అన్నయ్య మాటలు కొత్త అర్థాలిస్తున్నట్టు న్నాయ్. తర తరాల మానవుల మూలుగులు నాకూ విని పిస్తున్నాయ్! మూలుగులు. గూని మేదరవాడి భార్య మూలు గులు!

క్లాసు పుస్తకంతీసి చదువుకుంటూంటే అన్నయ్య నవ్వు తున్నట్టు, కుర్చీలో కూచుంటే వెనకనించి వస్తున్నట్టూ, అన్నం తింటూంటే అన్నయ్య విగ్రహం, అన్నయ్య స్వరూపం! పుస్తకాలు చదువుకోమన్నట్టు!

క్లాసులోకెళ్లి మాష్టరు బోర్డుమీద రాసే అక్షరాల వంక చూశాను. అక్షరాలూ అంకెలూ కదిలి అన్నయ్యలా మారినట్టు అవుపించింది. అన్నయ్య! అన్నయ్య!

సాయంత్రం పేపరుతీస్తే అన్నయ్య స్వరం వినిపించింది. మూల అన్నయ్య పేరూ, వదినె పేరూ! ఫొటోలు కూడాను! అన్నయ్యకు పెళ్ళయిందట! రిజిస్ట్రేషన్ పెళ్లిట! సాక్షి సంతకంచేస్తే బాగుండున్నేను!

ఒదిన అన్నయ్య పక్కనుంచుని నవ్వుతోంది. ఒదిన పువ్వులమీద నుంచికాదు నడిచేది. పదునయిన కత్తులమీద ఆవిడ నడక! ...అన్నయ్యలాంటి అన్నయ్యలంతా చేతులూ చేతులూ కలిపి గొలుసు కడతారట. ఆ గొలుసే మానవ జాతి భవిష్యత్తును రక్షిస్తుందట!

ఈ సాయంకాలం అన్నయ్య గదిలో కూచున్నాను. కిటికీ తెరిచి చూచాను. సంజచీకటి. ఎందుకో హఠాత్తుగా

అన్నయ్యని చూడాలనే జ్వరం. వొదిన్లా పెళ్లికూతురు కావా లనే కోరిక !

కత్తిరించి పుస్తకంలో అంటించుకున్న ఒదిన బొమ్మ తీశాను. ఒదిన నవ్వుతోంది 'ఎందుకా ఆలోచన' అన్నట్టు! నావంక అన్నయ్య నడిచి వస్తున్నాడు. నాచెయ్యి పట్టుకుని ఒదిన నడిపిస్తున్నది. పక్కమీద నీరసంగా వాలాను !

* * * *

నాన్న గదిలో కొకసారి తొంగిచూసి 'రేపు సెలవు పెట్టమ్మా !

'ఎందుకు నాన్నా ?'

'నిన్ను చూసుకుందుకు వస్తారు'

గుండెలో రాయిపడింది!

కళ్లు మూసుకుని అర్ధరాత్రి పడుకున్నాను. నిద్రపట్ట లేదు. అన్నయ్య నన్ను పిలిచినట్టు కేక వినిపించింది. ఒదిన నాకు జడవేసి పువ్వులు ముడిచినట్టు...

వొళ్లంతా సలుపుతోంది. ఎత్తికుదిపినట్టు; శరీరంవేపు అలంకరణ. పెళ్ళివారూ...నచ్చడం. వీటి గురించి ఆలోచన !

ఎవరో చాలా వికృత స్వరూపం ! ఎవరదీ ! ఎందుకా వికటాట్టహాసం. పొడుగ్గా చేతులు ! చాచి నా శాంతినికేతనం గోడలు కదిపి కుదిపింది. పుస్తకాలు ! అన్నయ్య కొనుక్కున్న పుస్తకాలు! తగలబడిన మంటల భగ భగ ! నా పీకచుట్టూ నల్ల త్రాచుపుస్తెల నానులాగా చుట్టుకుంటున్నది. లేచి

భయంగా ఇటూ అటూ చూశాను. ఎవరూ లేరు. గదినిండా చీకటి. కిటికీ తలుపు తెరిచిచూశాను.

గది అవతల వెన్నెల! వెన్నెల! అన్నయ్య ఈ చీకట్లోంచి వెళ్లిపోయాడు...

'నాగురించి కాదు... మానవజాతి భవిష్యత్తుగురించి'

అన్నయ్య మాటలివి. మాటలు కావు. మంత్రించిన సంగీత కృతులు. అన్నయ్యా వొదినా నన్ను చేతులెత్తి ఆహ్వానిస్తున్నారు. ఒదిన 'రావమ్మా! రా!' అంటున్నట్టు అన్నయ్య నవ్వుతూ 'బోధపడుతోందీ పుస్తకం!' అంటున్నట్టు!

మానాన్న 'ఎలాగా తలపెట్టాం. దాన్ని మానరసమ్మ కొడుక్కి కట్టబెట్టేద్దామూ?' అన్నమాటలు గింగురుమంటున్నాయి. కిటికీలోంచి వెన్నెల! వెన్నెల్లో స్నానం చేయాలని వుంది! వెర్రి నాన్న!

ఆలోచిస్తూ అటుయిటూ ఈరాత్రి పక్కమీద దొర్లుతున్నాను. అన్నయ్య రాసిన ముక్కలు జ్ఞాపకం వచ్చాయి.

'అనవసరంగా నా పెళ్ళి ప్రయత్నాలు చేయకండి? వెర్రినాన్న!'

ఆలోచిస్తూ అటు ఇటూ ఈ రాత్రి పక్కమీద దొర్లుతున్నాను. అన్నయ్య విడిచివెళ్లిన రాత్రి- జ్ఞప్తికి వస్తోంది!

సిద్ధార్థుడు బుద్ధుడు కావడానికి విడిచివెళ్లినరాత్రి!



# షష్టిపూర్తి

తనాక్కు ముత్యాలు పాకలో నులకమంచంమీద చతికిలపడ్డాడు. పొడుగ్గా తన జుత్తుముడిని విప్పుకొని మునివేళ్ళతో సవరించుకుంటున్నాడు. సంతలో కొన్న వూలుముక్క నులకమంచం కోడుమీద పడేసివుంది. సీతి దాక దగ్గర మేకుకి తగిలించిన సీసాకాయ తీసి మొగుడిదగ్గరకు పట్టుకెళ్ళింది. సీతి వాడికి మారుమనువు.

భార్య కొబ్బరినూనె రాస్తూ కర్రిదువ్వెనతో ఈళ్ళు తీస్తోంది. జడలో పేనుకుని అల్లుకునే సవరం గట్టిగా విడిపింది. పేనొకటి పారిపోతోందిచరచరా. జుత్తంతా మెతకకంపు. కొడుతోంది. భార్య తలదువ్వుతూంటే ముత్యాలు కళ్ళమీద నిద్దర తూగింది! 'చాబాసో! నిదొరితున్నాడు' అని సీతి ముత్యాలును మోచేత్తో పొడిచింది. గాజుల గలగల విని ముత్యాలు ముచ్చట పడ్డాడు!

మొలలోని చిక్కతీసి ముత్యాలు డబ్బు లెక్కచూసుకున్నాడు. రెండురూపాయల ముప్పావలావుంది. కరణంగారు తాపీపని చేసినందుకు యివ్వవలసిన అర్ధరూపాయియిస్తే, అది

కూడా పట్టుకుని సంతకిపోవచ్చును. ఉళ్లోకరణాలూ మునస బులూ పనులుచేయించుకొని కూలి డబ్బులీయడానికి అలాగిం జుకుపోతారేం చెప్మా! ఏదోయింతగద్దు, భూమీదున్నకుని వేసం కాలంలో పొలంపనులేపీ వుండవు కనక వృత్తినే కూచుంటే బువ్వేలా వస్తుందని చెప్పి తాపీపని చేసుకుంటూ పైసా పరకా ఆర్జించుకుంటున్నాడు.

సీతికూడా ఆర్జనపరురాలే! లక్ష్మీనంవారం సంతకెళ్లి వారం వారం ఉల్లిపాయలూ ఉల్లికోళ్లూ వేసుశనక్కాయలూ కొనితెచ్చి వూళ్లో పిరవాణస్తంభందగ్గర గోనెగుడ్డ పరుచుకొని కొట్టుపెడుతూంటుంది. జంతికలూ, కొబ్బరుండలూ బడిపిల్లలు కొనుక్కుని తింటూ యిళ్లకి పోతూంటారు. దుకాణంలో మిగి లిన ఆ నాలుగు డబ్బులూపెట్టి 'తాళింపు' సామాను కొను క్కుని కొత్తకోమటింటినుంచి తనగుడిసెకి పోతుంది. వీధమ్మట నడిచి వెడుతుంటుందా, 'అదేటోలమ్మ! సిత్తకాణి) కుక్కల్లా చూత్తారేమగోళ్లు!'

ఈవేళ తాను పెత్తందారు యింట్లో ధాన్యం దంపడాని కెళ్లాలని మొగుణ్ని తెల్లారుగట్టేలేపింది. దబ్బు దబ్బున నాలుగు పోట్లు వేసి యిప్పుడే వస్తానని యింటికొచ్చింది. మొగుడు సంతకి వస్తాడని యింటికొచ్చింది. మొగుడు సంతకి ముస్తాబవు తున్నాడు. ముస్తాబు పూర్తయాక ముత్యాలుగోడదగ్గరికెళ్ళి నిలబడ్డాడు. అతికిన గోడకి బెత్తెడుమేర కన్నంతీసి అద్దంపెంకు అతికించివుంది. అద్దం చిన్నదైతేనేం, మొహం వున్నదున్నట్టే కనిపించింది!

అద్దంలో మొహంచూసుకుంటూ ముత్యాలు 'దుద్దులుంటే బావుణ్ణే'

'ఎక్కణ్ణించి తేనాి! దస్తుకట్టేసినావ్ గందా!' పన్ను కట్టేందుకు దుద్దులు తాకట్టుపెట్టిన సంగతి జ్ఞాపకంవచ్చి ముత్యాలు ప్రాణం చివుక్కుమంది. సంతకెళ్ళోన్న తన పెనివిటి చెవులికి కమలాలుంటే చూడముచ్చటనిపించింది సీతికి!

పొద్దున్నే లేచి, ఎవడిమొహం చూశాడో ఆపొద్దు. తొలీతా దివాణానికి పన్నుకట్టినా, మళ్లీ కట్టవలసొచ్చింది. రశీదు ఆయన యివ్వాలేదు; ముత్యాలు అడగనూ లేదు. కాని మరి పదిపన్నెండు రోజులు పోయాక పన్నుకోసం జప్తులన్నాడు. ఊరంతా టముకు వేయించాడు. తలెత్తుకోని మర్నాడు తిరగలేకపోయాడు. ఈ పంటలూ పన్నులూ వెట్టి చాకిరీలూ పడలేక సొహంత్రింగా బతకచ్చునుగదా అని 'బీడీకొట్టు పెట్టుకుందావే' అన్నాడు. సీతిబాగుదంటే బాగుందంది కాని, కుత్తికంటుమాత్రిం తాకట్టు పెట్టద్దంది. తాకట్టు వాకట్టయిపోతే ఆనక 'ముసిల్దాన్నైతే నాకాలికీ సేతికీఎవరొత్తార్రా' అని ఏడ్చింది. లేకపోతేనా ఈపాటికి పాణం హాయిగా వుండును. ఈ వెట్టిచాకిరీలు తప్పిపోయివుండును. కరణంగారి వెట్టిచాకిరీ గాబులకో నీళ్లుకోడడం లగాయతు కొంప కట్టించే వరకూ వుంటుండాయెను!

కరణంగారు మా చెడ్డ గడుసుబుర్రి; అంతా గోనెపీచు వ్యవహారం. అలాగేకట్టారు మండువాలోగిలి. దివాణానికి కరణంగారంటే పంచప్రాణాలూను. దివాణంలో పెళ్లిళ్లూ

పేరంటాలూ అయితే కరణంగారిదే కర్రపెత్తనం! బీరకాయలూ, దోసకాయలూ, పొట్లకాయలూ కొల్లలు కొల్లలుగా వసూలుచేసి దివాణానికి తోలేస్తారు. దివాణం సొమ్మంటే తన సొమ్ముకంటే, పదిరెట్లు పదిలంగా చూసుకుంటారు.

ఓసారి జమ్మాలీ గట్టుని దివాణం వేపచెట్టెక్కి ముత్యాలు పందుంపుల్ల విరుచుకుంటూంటే దివాణంతరఫున సాక్ష్యం చెప్పడానికి కరణంగారు పట్నం వెళుతూ వెళుతూ ముత్యాలునుచూసి 'ఎవడమ్మగారిసొమ్మురా! దిగు దిగు!' అని కర్ర గిరవాటేశారు. మళ్ళీ అర్ధరాత్రివేళ అమ్మాయిగారికి పురుడొస్తే లాంతరేసుకుని వచ్చి నాలుగు రోజులకిత్రం 'ఒరే ముత్తేలూ! మంగలాడి నడిగి కత్తిపట్రా 'అని పురమాయించేరు పని; పనాని! మాటకెదురాడ్డానికి వల్లా? ఎదురాడితే మర్నాడు గేదలూ, ఆవులూ ఎవరివైనా సరే బందుల్దొడ్డే! కరణంగారూ పెత్తందారుగారూ మునసబుగారూ అందరిమాటా తెగని గొలుసులాగా వొకదానికొకటి అతుక్కుపోయి దానితో అందర్నీ బందులదొడ్డిలో పెడతారు. ఉద్యోగస్థులతో విరోధమంటే ఊరందరితోనూ విరోధమన్నమాటే!

మరి మొన్న మొన్న ఆసంగతే నిజమయింది. మెరక వీధి కాపుగారు మంగలాణ్ణి బుర్రగీయడానికి రమ్మంటే వెళ్లబోయాడు మంగలాడు. మధ్యలో పెత్తందారు గారింట 'పుట్టెంటుకలు తీస్తారు రమ్మని' వాసావాడు పరుగెత్తుకొస్తే వాడి వెంటవెళ్లాడు. పల్లవీధి పనిచూసుకొని మెరకవీధి కాపుగారింటికెడితే 'ఏరోయ్' యింతసేపు చేశావ్?'' అని గద్దిం

చారు. 'పెత్తందారుగారు కబురెడితే ఎల్లేను బాబయ్యా!' అంటే 'నాకన్నా పెత్తందారెవరా యీవూళ్లో న'ని నాలుగు లెంపకాయలు వేశాడు. ఎదురుగుండా పోస్టురాజు కూకు న్నాడా, ఏమీా అనడూ! 'తడిపిడిలగ్గం సేయాల్సిందే' అన్నాడు బూరయ్యకాపు.

పల్లపీధికీ మెరకవీధికీ పడదు మరి! ముత్యాలమ్మ పండుగనాడు సిరిమాను మా వీధినుంచి తేవాలంటే మా వీధి నుంచని రెండు వీధులూ కుమ్ముకుంటాయ్. అంతంత యీసులు కనకనే దివాణం చెరువు మరామత్తు లేకుండా పడివుంది. రెండు వందలెకరాల చెరువు. చెరువంటే చెరువా! వోజారవా చెరువు! గోదావరి కాలవ విడిచిపెట్టేసరికి నీరు గలగలమని మువ్వల మోతలు చేసుకుంటూ చెరువంతా నింపుతుంది. తొలిచూలు ఆడమాలక్ష్మిలా వుంటుంది చెరువు. మన్ను మేటవేసి అయి దారేళ్లయి బోర్లించిన కడవలాగయి పోయిందికానీ... ప్రతి ఏటా చంటిపిల్లలా మన్నుతింటే చెరువు గర్భంలో బల్ల పెర గక మానుతుందా! నీరు పొలాలకి చాలే చాలదు. 'బాగు చేయించరా బొమ్మదేవుడా' అంటే రాజుగారు ససేమిరా విని పించుకోవడమేఁ లేదు. పోనీ తలోబండి మట్టీ తవ్వుకుపోతాం, చెరువూ బాగుపడుతుంది, మాచేలూ నయమవుతాయంటే మహాజరు పంపించుకుంటే ఆబక్క తాణేదారొచ్చి చర్మాలొలి పిస్తానని పదిమంది రైతులపేర్లూ రాసుకెళ్లాడు! ఆమరుచటి ఏడే ఏనాడూ ఆనవాయితీ లేనిది చెరువు చేపలకి వేలాం వేయించి కితాబు సంపాదించాడు బక్క అమీనా!

కూలిజనం, రైతులు చేపలుపట్టుకొని ఆపది రోజులూ తినే కూటిలో మన్నుకొట్టి మంచిపేరు తెచ్చుకున్నాడు. కుడి చెయ్యీ ఎడంచెయ్యీ చూసుకుని న్యాయంగా వసూలుచేస్తే దివాణానికి ఆరులక్షలే డౌలు. చెరువులూ కాలవలూ మరా మత్తు చేయకపోతే అదీరాదు. హోలున్నా లేకపోయినా చడావు లేశి, నాజా రైతుల్నికూడా పీడిస్తుంటే!

శుభ్రంగా సాప్పిదాగా చెరువు దిబ్బయిపోతే దాన్ని కూడా సాగుబడికి వేలంపాడి అదనపు సొమ్ము బకురుదామని బొవురుపిల్లి దివాణం ఎత్తులు! చాలా చెరువులిలాగే పెసర చేలకీ పాదులికీ పాటపాడేరు. ఎంతబేసబుబుగావుంది దివాణం! సువారప్పోతుల్లాతిని ఉద్యోగులు వేలాలూ అమ్మకాలూనా! ఇంతమంది రైతులు వెయ్యిన్నొక్క గడప వున్నారు. మిడుతూ మిడుతూ చూస్తూ ఊరుకుంటారేం చెప్మా!

ముత్యాలకీ ఆలోచనల్లో పొద్దెంతయిందీ తెలియలేదు, సూర్యుడు వేపచెట్టు దాటిమీద కొచ్చేశాడు. నాలుగుమైళ్లూ చక చకా నడిచేస్తే సంతనుంచి బేగి యింటికొచ్చేయొచ్చును. వెంకిముండ 'పూలుకొని పెట్టవంటరా!' అని నాలుగు వారాల్లైపీక్కుతింటూంది. ఓపిడిపూలూ, అణా అద్దం, కర్రి కుంకంబరిణె, మూపిటికింత రెయ్యి పొట్లు, బాస్! కొనితెచ్చు కుంటే సరిపోతుంది.

అబ్బ! వారంవారం గతుకులరోడ్డంట నడిచివొస్తూంటే గూళ్లన్నీ యిరుకు పెడతాయి. ఆ చెరువుగట్టు వొకమైలు నడవడం వొకయెత్తూ, మిగతాదూరం నడవడం యింకొక

మెత్తూ. వానాకాలంవస్తే సరేసరి! మొలలోతు బాడిలో దిగి మరి పైకిలాగినా బండి రానేరాదు. మనిషి వెడితే అడుసులోకి అడుగు దిగబడి గుడిస్తంభంలా నిలబడిపోతాడు. అయినా అలాగే వెడతారు జనం! అంతేకాని 'దీని వ్యూసేటన' డగరు! ఇంతంత జీతాలు తింటున్నారు. మేడలు దిగిరారేం యీ వానా కాలంలోనని అడగడానికి ఎవడికైనా నోరు పెగిల్తేనా? పోనీ కనికరించి ఆ మారాజుగారు మరామత్తూలేదు, మసీకత్తులేదు. ఎంతసేపూ కుక్కల్నెంటేసుకు తిరగడవేఁ ఆయనపని! చెన్న పట్నంసావాసం. చెడుసావాసం! దొరసానులూ, వేట కుక్కలూ; దస్తులుమాత్రిం అన్నపాళంగా కట్టేయాలి. లేక పోతే గేదెలూ గిన్నెలూ ముంతలూ అన్నీ జప్తు!

ఆ పొద్దేమయింది? కట్టుకర్రికి కట్టిన గేదెని పాలైనా పిండుకోనీయకుండా పొద్దున్నే తోలుకు పోయారు. గేదెంటే గేదా! రెండీతలైనా ఈనలేదు; తల్లి మాలచ్చిమి రేపుసేరూ మాపుసేరూ! చింతపిక్కేసినా ములగనిపాలు, చిక్కని మైనం లాంటిపాలు! నిక్షేపంలాటి గేదెని శనివారం సంతకి తీసికెళ్లి అమ్మేశారు. ఎన్ని పశువులొస్తాయ్ సంతకి! తూర్పునుంచి కూడా ముండాసామ్ములు తోలుకుతెచ్చుకుని అమ్ముకుంటారు. నోరూ వాయీలేని జీవాలు అలాపడి యేడుస్తాయా నీటికోసం! ధర్మదాత కోటీశ్వరుడున్నాడు మారాజు వూళ్లో. ఒక్క నీటి కుండీ వాటికోసం తవ్వించలేకపోయాడు! పైగా పశువుల్ని దుక్కగావుంటే పొగిడి వెండిగిన్నెలు మీటంగంలో పంచి

పెడతారట ! పై ప్రజ పదిమందీ మారాజు పశువుల క్షేమం కనిపెడుతున్నాడని చెప్పుకోవాలి! మనుష్యులకే లేదూ: పశువుల కొచ్చాయ్ నీటిసదుపాయాలు ! ఇంత ఊరు పేరు చెప్పి కుళాయిలే లేవు. పాతాళలోకంలోంచి నీళ్లు తోడుకోవాలి !

కారుల్లో సలవబట్టలు కట్టుకొని దుమ్ము రేపుకుంటూ తిరగ్గానేసరా ? ఆ కారుదుమ్ము ఎవరి వొంటిమీద పడి బాధ పెడుతోందో కొంచెం చూసుకోవాలి.

ఇంత అసహ్యంగా వుందికనకనే దివాణం పెట్టిలో ఆపొద్దు పడమన్నా వొక్కవోటు పళ్లేదు. కాంగ్రెసువారిమీద దివాణం, దివాణంమీద కాంగ్రెసూ మీటింగులు చేసుకొని వాళ్లమీద వాళ్లు కత్తులు నూరుకున్నారు. తిట్లూకొట్లూ! 'తద్దినాల బాపనయ్యకి వోటేటో దానక్కడుపు కాలిపోను వోటేటో'నని పదంపాడేరు దివాణం నౌకర్లు. 'మీ చెరువులు బాగుచేయించారా? మీ కాలవలు తవ్వారా ? ఇంతంత పన్నులేమిటి; మీకీ వెట్టిచాకిరీలేమిటని' కాంగ్రెస్సువారూ చెప్పేరు. ముత్యాలమ్మ గుడిదగ్గర ఆబాపన వకీలు సభచేసి జమీందారులు ఏమిటేమిటోనని ఉపమానం చెప్పి మాచిత్రంగా వర్ణించేడు. ఆఁ ఆఁ... జమీందారులు పెద్దపులులు ! రైతులు మాలీమేకలు. పెద్దపులులు పంజా విప్పుకుని మేకల్ని రమ్మని పిలవడందేనికి ? అని గద్దించాడు. కాంగ్రెసును గెలిపిస్తే జమీందారులు పోతారని మరి మరీ చెప్పాడు. జమీందారు లెక్కడికి పోయారు ! కాంగ్రెసులోకే తప్పుకున్నారు !

చేసింది చట్టం! మా గొప్ప చట్టం!! తెగించి దానం చేస్తాను తేరా పిడికెడు రాళ్లంది!

ఆనాటి మాటలన్నీ ఈపొద్దు మరిచి మహారాజుగారిని ముస్తాబుచేసి కార్లోకూర్చోబెట్టి వూరంతా తిప్పుతారట! ఆయన పుట్టిన్రోజయితే మనకెందుకీ సొద! 'నేను దగ్గుతాను; నువ్వు పక్కలెగరెయ్!'

లక్షాయేభైవేలంటే మజాకాలా! ఎంతతిండీ, ఎంత పంటా! ఎంతమంది బతకొచ్చునని! కరువొచ్చి కాటకాలొచ్చి శేరు రూపాయిచ్చినా దొరకనిరోజుల్లో ఎవడొచ్చి ప్రజలకి గుండెధైర్యం చెప్పాడు! పైగా మోతుబర్లూ కాంగ్రెసుని తిరుగుతున్నవాళ్లూ బట్టలూ అవీ దొంగతనంగా అమ్మి లాభాలు గడిస్తున్నారు. అప్పుడు మనబాధ ఎనడికీ అక్కర్లేక పోయిందికదా అనుకున్నాడు ముత్యాలు. ఓట్లకాలం వచ్చింది. మీటింగులు చేస్తున్నారు. అడిగిన వాడికల్లా ఓటిస్తానండమే? నామనసుకి నచ్చినవాడికిస్తానంటే సరీ-అనుకున్నాడు ముత్యాలు. లేకపోతే పెద్దపులి మేకలికి పెత్తందారేమిటి?

పెత్తనాలు మానుకుని సంతనుంచి పెందరాళేవచ్చి, పాదులికి గొప్పులు తవ్వుకోవాలనుకున్నాడు. వంగపిందెలు తెంపుకొని కావిడ పొద్దున్నే వేస్తే పావలా అర్థా కళ్ల చూడొచ్చును. ఇంతపనుండగా కరణంగారు 'ఒరే ముత్తిగా! సంత నుంచి నాలుగు కుండలుపట్రా' అని పురమాయించారు. కరణంగారు మాచెడ్డ పెంకిఘటం. ఎక్కడేందెబ్బ తీయాలో ఆయనకి తెలుసునుకనకనే దివాణం లక్షాయాభైవేలలోనూ

పదివేలు నీవంతన్నారట! పదివేలే! ముండాగ్రామం పదివందల గడప! ఇంటింటికీ పదిరూపాయల పన్ను! అంత సరదాగా వుంటే తనఖుస్బు పెట్టుకుని ఊరేగాలికాని యీ అకృసు ఎసూ ల్లేమిటని! సిలదీసి అడిగేవాడెవడు!

మా రాజుల పక్కల్లో బళ్ళేలు కాంగ్రెస్సంటే. ఆబళ్ళేలే జమీందారులకి కాపుదల అయితేనే. కాలం అడ్డసుడి తిరిగింది. మహారాజుగారు తనవాంతుకో సీటిప్పించమని కాంగ్రెసుకే కాయితం దాఖలు చేశారుట!

దగ్గుకుంటూ యింతగంజితాగి ముత్యాలు గోడప్రక్కన నించున్న సీతికోక చెంగుకి మూతీ చేతులూ తుడుచుకున్నాడు. దూరంగా పెంటమీద కోళ్లు కెక్కరిస్తున్నాయి. పెట్టను పుంజు తరుముతోంది. పుంజును పెట్ట విదిలిస్తోంది. సీతి తాటిఆకుల బుట్టలోంచి చిరిగిపోయిన పాతకోకముక్క చించి 'పైమీదేసు కోరా!' అంది.

'నాకోసం ఎవరైనావొత్తే పెద్దమ్మి యింటికెళ్లానని సెప్పేం!'

'ఏటాఅబద్ధంవూ?'

'పెమాదం; వూళ్లోలేనని సెప్పేసి'

'ఏటా యిద్దూరం?'

'కరణంగోరు నావంతు సందా వదిరూపాయలేసేసారు'

'సందా లేటి?'

'మన మారాజుగోర్ని తిప్పుతారంట వూళ్లో'

'తిప్పడానికింత డబ్బెందుకునోరి!'

'సెన్నపట్నంనుంచి నాటకాలూ నాయకులూ వత్తారు కదంటే'

'మామెకట్నుంచి తేమూ ?'

'అదేటో ఆడిసిత్రం గూడు !'

'దానికేనేట్రా మెరకీధి కాపుగోర్మీద పెత్తందారుగోరు ఎగిరిపడుతున్నారు ?''

'కరణంగోరూ బెదిరింపే తన్నిత్తామని. లేదంట్వే హాత్తేరీ ఎదవా అని సెంపకాయలు ! తలకోపెద్ద అయిపోనారు !

'గవిన్నే రూరుకుంటాడా యింత అన్నేయం, కళ్లముందు జరిగిపోతావుంటే !'

'అడగిల్సిన నాయకులే జమాజట్టీల్లాటోరు ! ఏటకు కట్లా టోరు. ఆరే, మారాజుగారింట యిందులూ యిద్దెలూ కతుకుతూంటే '

ముత్యాలు పైమీద కోకపీలిక వేసుకొని కిర్రుచెప్పులు తొడుక్కొని బయటికి నడుస్తున్నాడు. వీధిమళుపు తిరిగి మల్లం గొయ్యిదగ్గరకొచ్చేడు. గొయ్యి కంపు కంపు ! గబుక్కున గతు కల్లోపడి నడుంపూస బెణికి నట్టు చిటపటమంది. అన్నీ బంటాలే, వీధి వీధంతా చచ్చిపోయిన వాడు బిగించిన పిడికిడిలాగుంది. కాంగ్రెస్సాయన పంచాయితీబోర్డు ప్రెసిడెంటయి గోతిని కప్పేద్దామంటే మారాజు పార్టీ, నాయుడుగారొద్దన్నారు. ఆయన వేయించినదీపాలీయన తీయించేస్తే ఈయన పెట్టించిన స్తూలు అయన లాగి పారేయించేశాడు. ఈసారి అంతా వొకటైపోయూరు. ఏంచేస్తారో చూడాలి !

ముందుకి నాలుగడుగులు నడిచి అచ్చన్నగారింటి కొచ్చాడు. అబ్బో, అచ్చన్నగారంటే తక్కువ జాతకమా! కాపునీ కందిగింజనీ వేయించాలనీ, మెరకవీధికీ పల్లవీధికీ లడాయి పెట్టి దివాలా తీయించారు. చచ్చిపోయారు కాని ఈ దివాణం వసూళ్లలో సగానికిసగం ఆయన తాంబూలం ఖర్చుకింద్రైపోను!

తాంబూలం నములుకుంటూ మునసబుగారు వొస్తున్న ట్టుందే! వొక్క మునసబుగారే కాదు. పెత్తందారుగారు కర్ర కాలుమీద కుంటుకుంటూ తోసుకొస్తున్నారు. కరణంగారు పుగాకురెమ్మ చుట్టుకుంటూ నడుస్తున్నారు. బైసికీలేసుకుని తాణేదారుగారు. అమ్మనాయనో! చండశాసనుడు! కర్కోట కుడు. యిటేయిటే. పంటచేనుమీద మిడతలదండులా వూళ్లో పడింది దివాణం దండు!

ముత్యాలు గుండెల్లో ఎవరో చావుబాజా వాయించి నట్లయింది. గబగబ దొడ్డు లంకించుకున్నాడు.

తండ్రి చెప్పకుండా వెళ్లిపోతున్నాడని వెంకిముండ పాక లోంచి తుర్రిన పిగిలిపిట్టలాగా పరుగెత్తుకొచ్చింది. తండ్రి పంచెపట్టుకొని యీడిగిలపడుతోంది: 'పూలు తేవురా!' దాన్నో మూలకునెట్టి ముత్యాలు పాకలోకి పరుగెత్తు కొచ్చాడు 'సీతీ! కరణంగోరూ ఆరూ వత్తన్నారే! నాన్లేనని సెప్పేయ్' అని కోళ్లగూటిలో కోళ్లనితోలేసి దాంట్లోకి దూరాడు. అబ్బబ్బ! యిరుకూ! ముక్కుకోణాలు మాడిపో తున్నకంపు, కంపు! కంపు కంపూ!

'ఆయెదవ ఎప్పుడొచ్చినా పారిపోవడమే! సత్ర కాయలా పూరుపేరు చెప్పి యీాడే మిగిలిపోనాడు. దస్తుకట్టే మను. లేదంటాడా జాగర్త! కపడ్దార్' అంటూ పెత్తం దారు కర్రి గుర్రింలాగ తోసుకొచ్చాడు.

'నానేటి సేత్తాన్బాబూ! బీదోళ్లం! మాకీ సందాలేటి కరణంగోరూ!'

'ఆనక సెప్పనేదంటావ్; ముందే సెవుతున్నాం. ఆడ్డ రయింది! ఆడ్డరు! ఆ పదిరూపాయలూ తెచ్చి చెల్లించు కుంటాడా చెల్లించుకోమను. లేదా కొంప కగ్గిపెట్టుకుంటాడా మారాజుల్తో యిరోదపడి పెట్టుకోమను!'

'పెబువులికింత కోపవైతే కనిపెట్టుకు నోళ్లం మాగ తేటి మునసబుగోరూ?'

'కట్టు కట్టు! కుత్తికంటో, దుద్దులో తాకట్టుపెట్టు, లేక పోతే ఆనక కాపరం ముప్పవుతుంది.'

'కరణంగోరూ, దస్తు ఆయేటు కట్టేశినాంకదండీ!'

'ఆసి నీయింటా పటారంగానూ! మాటకిమాటా జవాబు చెప్తుంది మాలముండా!'

'కరణంగోరి మాటకే మిగల్నెపతావ్' అని కర్రికింద కొట్టాడు వాసావాడు.

'ఏటి బాబో వాసావాడికుక్కాడా దూకుడు!'

'కట్టేత్తే నీజోలికీ శొంటికీ రమ్మన్నా ఎవడూ రాడు!'

'మరితప్పద్దేటి! పుస్తో పూసో...' అని బిక్కమొహం

వేసింది సీతి. పెత్తందారు కర్రికాలుమీద గుర్రిపుదాట్లు వేస్తూ వెళ్లిపోతున్నాడు.

అంతా వెళ్ళిపోయిన తరవాత కుత్తికంటుతీసి సీతి నూతిలోంచి కేకేసినట్టు 'ఈళ్ళజిమ్మడిపోనూ! ఈళ్ల నేత్రాల్లో జిల్లేడు పాలొడవా! ఈ ళ్ళింట్లో రక్కిసు మొక్కలు మొలవా! ఈళ్ళ మొలకి మొలతాడు కట్టే మొనగాడే లేక పోనాడా?' అని యేడుస్తోంది.

భార్యతిట్లువిని ముత్యాలు గుండెధైర్యం తెచ్చుకున్నాడు. కోళ్ళ గూట్లోంచి పుంజులాగా మెడసాచుకుని పైకి వచ్చాడు. దగ్గరనుంచున్న పెనివిటినిచూసి సీతి కొద్ది దూరంగా వొసి లింది. ముత్యాలు 'నానేటిసేసీది' అన్నట్టు చూశాడు.

ముత్యాలు చేతిలో కుత్తికంటుపెడుతూ 'తాకట్టెట్టి పెత్తందారెదాన్నికొట్టు...పదికన్న ఎక్కువతేసుకోరి!' కుత్తి కంటుమెలికలు తిరిగి ముత్యాలు చేతుల్లోకి పాములాగ పాకి వెళ్ళింది. చింతపండులాటి బంగారం! మైనపుముద్ద! తనతల్లి చాకిరీ చేయగా చేయగా చచ్చిపోతూ సీతిని 'దాక దగ్గిర గూట్లో కుత్తికంటుంది. తీసుకోయే!' అని నోరారాపిల్చిచ్చింది. పెద్దబొట్టికి పుట్టెడు జబ్బు చేస్తే, అవసరంపడిందిమ్మంటే దుద్దు లిస్తాను కాని కుత్తికంటివ్వనంది. ఎప్పుడైనా తన కుత్తికంటే పామై వాళ్ల మెడకి చుట్టుకొని కాట్లేయదా!

ముత్యాలు దోసిట్లో కుత్తికంటుని మూసి దాచి పది లంగా పట్టుకెడుతూంటే ఎదురూగా వెంకిముండవచ్చి 'సంత

కెళ్లలేదేంరా ! నానూ వత్తాను' అని ప్రయాణమయింది.'
'వుండే ఏటిసంత ?' అని కసరికొట్టాడు ముత్యాలు.

'సంత కెళ్లితే నాకు పూలు తేబడద్దని మానీసినాడు!' అని మారాం చేస్తోంది. 'ఈపాలి నువ్వు సెప్పినపని సేత్తానేమో సూడరా !' అంది లంచాలముండ !

తన వెంకిముండ యింత లంచాలముండకదా తన కుత్తి కంటు తాకట్టు విడుతుందో విడదో ! తాకట్టు వాకట్టయితే తనకి పెద్దకాలం వచ్చాక వెంకిముండ కేమీ పెట్టకపోతే ఆనక కాలుకీ చేతికీ అందొస్తుందా ? ఎందుకులే ! వెంకిముండ పెళ్లి చూపులకి విడిపిద్దాం అనుకొని మళ్లీ విడిపించగలనా అనే అనుమానంతో గొల్లుగొల్లుమని ఏడిచింది !

సీతి గుండె బాదుకుని ఏడిచింది ! పెద్ద చెరువంత ఏడుపు ! దివాణం చెరువంత ఏడుపు !



# పాలికాపు

రోకలిబండలాగ నడుచుకుంటూ రాముడుగాడు బస్తీలో కాలుపెట్టాడు. ఎంతబస్తీ! తార్రోడ్డు ఎండకి నల్ల తాచులా మెరిసిపోతోంది. లారీలు ముందునించీ వెనకనుంచీ రొద రొద చీంబోతుల్లాగ. లారీలకింద పడిపోతానేమోనని బెదురు గొడ్డులా నడుస్తున్నాడు. రెండుపక్కలా రోడ్డు వార షాపులు చూడమాంచిత్రంగా వున్నాయ్ !

ఊలు, రిబ్బన్లు జోళ్లూ గిలగిచ్చకాయలూ మర బొమ్మలూ విచిత్రంగా చూసుకుంటూ నడిచిపోతున్నాడు. పై మీంద గుడ్డకి పావలాకాసే కట్టివుంది. లేకపోతేనా బూట్సుల జోడు కొనేసును. దానింటా పటారంగానూ, నేధవ బూడ్సుల జోడుకేం! మిల్లుపన్లో యిదుగో ప్రవేశిస్తాడా! ఆరోజుకే రూపా యిగడిస్తాడు. చేతిలోపైసా పరకా యింక మసులుతుంటే 'ఇంక నీపని సూడసిత్రంరా' అన్నాడు మేస్త్రీ. వాడానాడే రమ్మ న్నాడు. మేస్త్రీ మాటలింటే ఈ పాటికి పిడతలో డబ్బు నిలవ తొక్కుకోడా! 'వొద్దే! వొద్దుగా కొద్దే' అని బతిమాలినా

రెండువందలు బాకీ తెచ్చి కాపుగారింట్లో తల్లి రాముడుగాణ్ణి పనికి పెట్టింది. నాలుగేళ్ళయి చాకిరీ చేస్తున్నా కాపుగారి బాకీ యింకా తెమల్లేదు. పాలికాపుపని మానాలంటే రెండొం దలు ఎక్కడతేవడం!

పొద్దున్నే లేచి పశువులసాలలో కెళ్లితే పేడకంపేస్సి! దోమలు జుఁయ్‌మని సంగీతం. బండెడుపేడా కుమ్మి ఉచ్చ వాసన్లో పిడకలు చరిస్తే కాపుగారి మరదలు సొమ్ము చేస్తుంది. కాపుగారి పనికి అంతూ పొంతూ వుండదు. పచ్చగడ్డితెస్తే ఎండుగడ్డి తెచ్చేవ్ కావు. ఎండుగడ్డితెస్తే పుల్లలు కొట్టేవ్ కావు. ఛస్; ఛస్. పాలికాపు బతుకు! చేతులన్నీ రక్కెస కాయల్లా పేలిపోయి గుచ్చుకునేట్టు పేళ్లు కొడితే 'ఇటికావం కాల్పిద్దామా?' అని కాపుగారు!

దాన్తల్లీముండా మొయ్యని గేదె. బోడిగోదె. వచ్చి నట్టేవచ్చి చీకటాఁవులోకి దౌడు తీసింది. 'లండీకొడుగ్గదరా! లంజకొడుగ్గదరా!' అని కాపుగారి కేకలు! కాపుగారు తిడు తూంటే మరదలు కిటికీలోంచి తొంగిచూసింది.' తిట్టకండ య్యాయ్' అంటే కర్రి మీదికి విసిరారు. పారిపోతూంటే అడ్డేసి ముల్లుకర్రితో డొక్కల్లో పొడిచి 'నరికేస్తాను. డొక్క వాల్కల్ చేస్తాను.' అన్నాడు. ఛస్! వాళ్లంతా సలుపూ; పొడపాము కుట్టినట్టు!

'ఆఁ! నరుకుంతోడూ! ఎవడాఁ పదేసి!' అని మేస్త్రీ పనివేయిస్తానని అన్నాడు కనక సరిపోయింది.' మాలేటి, మాది గేటి! ఎవడిబతుకాడు బతికినన్నాళ్లూ, వాడికిడి ఖాతరీయేటి?'

అన్నాడు మేస్త్రీ. మేస్త్రీ మిల్లుకి రాజు. వాడిపెళ్లాం వూళ్లో పెత్తమ్మ. వాడికేం వూలరింగడిలా కాలుమీద కాలేసుకు కూకుని తింటాడు! వొకడి మోచేతికిందనీళ్లు తాగవల్సిన పనేముంది వాడికి? మేస్త్రీ మిల్లుకు రాజు! వాడిపెళ్లాం వూళ్లో పెత్తమ్మ!

మిల్లులో పనులు అందరికీ వీడేయించిపవే. సూది మీసం, చేతులకి మురుగులు చెవులకి కమలాలు, చూడ్డానికి రాజులాగుంటాడు. వూటకి గతిలేని సిమ్మన్న మేస్త్రీ అయాక సిలక్కట్లు కడుతున్నాడు. తనూ యీనెలలో పంచెకొనుక్కుని సిలక్కట్టుకట్టుకోవచ్చును. రాముడుగాడు గుండు తడుముకున్నాడు. నెత్తిమీద రాగిడీవుంది. పట్నవాసపు కూలీలు నవ్వారు కదా అనుకున్నాడు. కాస్సేపు పోయాక తనకే నవ్వొచ్చింది.

తాగ్రోడ్డంట నడుస్తోంటే 'బాపనీధి' లాగ 'ఫో లంజకొడకా' అనడంలేదు. కుళాయినీళ్లు తాగుతూంటే 'మాలతొత్తుకొడుకు మైలచేస్తాడేమంట!' అని కసరడంలేదు. పట్టణవాసం ఎలాగైనా సజావైంది. బాపనీధిలో కాలుపెడితే పురాణం శాస్త్రిలు చచ్చిన గొడ్డును చూసినట్టు 'ఫో ఫో ఫో!' అంటాడు కదా! మొన్న గేదె పడ్డ చచ్చిపోతే మోసుకుపోయి చేటపెయ్యి తెమ్మన్నాడు! అప్పుడు లోపనికి మాలాడు రావచ్చా!

మేస్త్రీ సిమ్మడు చెప్పాడు 'బాపనోళ్ళు డసరాపీసుల్లో మాలోళ్ళ మందులు తాగుతారేసి' అని!

ఎవరెక్కడ ఏంతాగితే తనకెందుకు ! కాసిని గంజినీళ్లు తాగేందుకు యింతుపాధి తనకు లేనప్పుడు ! తనకే రెండెకరాల బంజరుంటే ఛీ ఛీ! ఈ పాలికాపు పని, మానుకున్ను. ఈ బస్తీకి మిల్లుపనికి మాత్రం తిరుగునా !

అయితేనేం, మిల్లుపని మంచిసులువైన పనని మేస్త్రీ చెప్పాడు. డబ్బుకు బబ్బూ, సుఖానికి సుఖమూ; నెల నెల ముప్ఫై రూపాయలు! 'తంతే దూదిపరుపుమీద పడతావ్, రారా' అన్నాడు మేస్త్రీ. తల్లీ చెల్లెలూ, తనూ సుఖంగా బతకచ్చుకదా నిరాముడుగాడు తలెగరేశాడు. పండుగలికి యీనాము లిస్తారు. మనసు కరిగితే యజమాని కళ్ళకద్దుకుంటాడని మేస్త్రీ చెప్పనే చెప్పాడుగదా ! కాని మిల్లుపని ప్రమాదం! నర్సిగాడి జబ్బవిరిగిపోయింది. కూలీపని పాలికాపుపనికన్న ప్రమాదమా, డానబ్బ సిగ్గోసిరి అర్ధరాత్రి చీకట్లో పొలానికి నీరొచ్చిందంటే వెడతాడుకదా పురుగూపుట్రా ముట్టుకోదూ మరి !

పురుగూ పుట్రా మాటకేం, నీటివాయితీకోసం పొలం గట్లమ్మట యుద్ధమేకదా! నాజార్రైతని పుల్లయ్యని కాపుగారు దబాయించి తనపొలం తడిశాకనే నీరొదుల్తానన్నారు. పుల్లయ్యగారు 'ఆయవ్వారం నాదగ్గిరి కుదుర్ద 'న్నారు. కాపుగారు కర్రిచ్చుకుని మీదికెళ్లారు. పుల్లయ్య కాపుగార్ని గట్టుమీంచి తోసేరు. 'సూత్తావేరా! రామిగా! ' కాపుగారు తనను వుసికొల్పారు. ఆపొద్దు ఎవరిమొహం చూశాడో రాముడుగాడు !

పుల్లయ్యగారి పెద్దకొడుకు వెంటతగిలి మాలపల్లిదాకా తరిమి తరిమి కొట్టాడు! ఛా ఛా పాలికాపుతనం!

మిల్లుపన్లో కష్టపడ్డా కడుపునిండుతుంది. యజమాని అమ్మా, ఆలీ, అనితిట్టడు. నాలుగురాళ్లు కూడబెట్టుకుందుకు వీలుంది.

పట్టణంలో బూట్సులజోళ్లు తొడుక్కుని మిల్లు కెడుతూంటే తిట్టరుకదా! తన గ్రామంలో నేరిగాడి కొడుకుని బూట్సుజోళ్లూ, కుడితిణీ తొడుక్కున్నాడని 'కాపుగోరికూడు వంటపట్టిందిరోయ్!' అని జావాడేరు గ్రామస్థులు. పల్లెటూళ్లో మాలాడు మైలబట్ట!

పట్నంలో మాలా, కాపూ అన్న వైనమే తెలీదు. అసలాభేదమేలేదన్నాడు మేస్త్రీ. రెండడుగులు ముందరొస్తే తనూ లారీలో అందరి కూలీల్తోపాటు బస్తీకి పోవచ్చునా! మరదగ్గర వుంటాడు మేస్త్రీ. రోజుకు రెండ్రూపాయలు కూలీ. నెలకీ అరవైరూపాయలు. దీన్తో ఏంచేసుకున్నా చేసుకోవచ్చును!

కడుపు కరకరలాడుతోంది. అణాపెట్టి కాఫీ కొనుక్కుంటే సరిపోతుంది. రాముడుగాడు మలబార్ హోటలులో కెళ్లి అయ్యారు బల్లమీద పావలాకాసు పెట్టాడు. ఎదురుగా గోడకున్న అద్దంలో తన మొహం కనిపించింది. ఎండకి వాడిపోయింది. అయ్యారు ఎగాదిగాచూసి నవ్వేడు. 'కాఫీ యియ్యండి' అన్నాడు రాముడు.

'డొక్కు తెచ్చుకోరా' అని అంతలోనే 'ఫో ఫో' అని కసిరేడు అయ్యరు. అయ్యరు చూపులు సూదుల్లాగ గుచ్చుకుంటే 'డొక్కేటి ?' అన్నాడు రాముడు.

చుట్టూ అయ్యర్లుమూగి ముంతలోంచి పెరుగొలకపోసి నట్టు నవ్వేరు. బల్లలు తుడిచేవాడు కప్పునీళ్లు తెచ్చి 'పోతావా మీదపోయనా ?' అంటే రాముడుగాడు పరుగోపరుగు ! ఒకటే పరుగు !

పరుగులంకించుకుని వీధి మలుపుకివచ్చి గుండెలో గేలం గుచ్చుకున్నట్టయి వొగురుస్తూ నించున్నాడు. 'ఆరి తల్లిముండా మొయ్యా, ఉడుకునీళ్లే దొరికినాయి కాదు !'

పట్టణంలో కూడా మాలాడంటే అలుసే ! మరి పెద్ద దొరమాలాడేనని మేస్త్రీ చెప్పాడు గదా ! వాణ్ణే యిలా పొమ్మని తగిలేస్తారా ? గుడ్లు మూసుకుని రాముడుగాడు 'ఇంకివియిప్పేయాల' ని ఎవరితోనో మాట్లాడుతున్నట్టు పైకి అన్నాడు.

రెండడుగులు ముందరికివేసి ఉడుకునీళ్ళమ్మే పాక కని పిస్తుందేమోనని పరకాయించాడు. ఎంతోమంది మనుష్యులు గాంధీటోపీలు పెట్టుకుని వస్తున్నారు. అయ్యరు తనకు కాఫీ యియ్యలేదని చెబితే గాంధీమనుష్యులూరుకోరు ! గాంధీ మను షులకి మాలాళ్ళంటే పేగు !

ఇంత గాలిమీదకివీస్తూ కుళ్లుకంపును మోసుకువచ్చింది. రాముడుగాడు 'శండాలం' అని ముక్కు మూసుకున్నాడు. పట్టణవాసపాళ్ళకి యిళ్లల్లోనే మరుగుదొడ్లు, రోడ్లునిండా

చెత్తా చెదారం, పేడా, ... కాపుగారి పశువుల సాలలావుంది వీధి ! తోళ్ళవాసన !

గాంధీమనుషులు వీధులూడిచి ఊరి కుపకారం చేస్తు న్నారు. గాంధీ మనుషులూ గవర్నమెంటూ వొకటేనట !

రాముడుగాడు తండ్రి చచ్చిపోయాక తన గ్రామంలో వీధులు తుడిచే వాడే లేకపోయాడు. ఎవడు చేస్తాడీపని! కులం తక్కువపని ! 'సెప్పులు అమ్మడు బడడంలేదు బాబయ్యా' అంటే ప్రెసిడెంటుగారు ముసిల్లాణ్ణి వీధులు తుడిచేపనిలో వేయించారు. సాటికులస్తులంతా తిట్టినా ముసిలాడికి వీధి తుడిస్తేనే కాని కడుపుకి జరిగిందికాదు !

వీధులూడుస్తున్న కాంగ్రెసు వాళ్ళని సచ్చురాళ్లు 'కూట్లో దుమ్ముపోయకండయ్యా ! ' అని బతిమలాడు కుంటున్నారు. కాంగ్రెసువాళ్లు వీధులు తుడుస్తూంటే సచ్చు రాళ్ళకడుపు కొట్టడమేమిటో రాముడి మనసు కెక్కిందికాదు. ముసిలి సచ్చురాణ్ని మెల్లిగా పిల్చి అడిగాడు. ముసలాడు యేడ్చాడు. మాయకడుపు జరగడం లేదని నాలుగు డబ్బు లెక్కువ అడిగితే కాంగ్రెస్సాళ్లు వీధులు తుడిచేస్తున్నారు.!

రాముడి కోడిగుండెల్ని ఎవరో తుడిచేస్తున్నట్లయింది. పోలీసులు, బతిమలాడుతున్న సచ్చురాళ్లని చెదరగొడుతు న్నారు. సచ్చురాళ్ల గుంపొకటి వచ్చిపడింది. ఇంకా అలాగా బతిమలాడుతూనే వున్నారు.

ఛస్ ఛస్ పట్నవాసం! తిండి చాలదని చెప్పుకుంటే తన్నే పట్నవాసం ! కాఫీ చుక్కైనా మాలాడికి పోయని పట్న

వాసం! తనలాటి రెక్కలమీద బతికేవాళ్లకి ఎక్కడా దిక్కు లేదు! దిక్కులేదని సమ్మెచేస్తే కాంగ్రెసుకేంపోయింది!

రాముడుగాడు వీధి మలుపు తిరిగేడు. సందులో చీపుళ్ల పుచ్చుకోని కూలీలు తుడుస్తున్నారు. సచ్చరాళ్లు కూలీల్ని బతిమలాడు కొంటున్నారు. ముసిలిసచ్చింది వణకుతూ వూడుస్తున్నాది. కాంగ్రెసుకంటే గుండెకాయ లేదు. ఈ కూలీలకి వుండద్దా అని రాముడుగాడి మనసు పీకింది.'

ఎదురుగుండా సిలక్కట్టు సిమ్మన్న! సిమ్మన్న రాముడిగాణ్ణిచూసి గబగబా పైకి వచ్చేడు. సచ్చరిది ఏడుస్తోంది. మసూచి పొక్కులమొహం జేవురించుకుని మాచెడ్డ దుఃఖంగా వుంది! పట్నవాసంలోనూ పేదవాడికి తిప్పలే!

'రామిగా! సీపురుచ్చుకో! సూత్తావేంరా! రెండూ పాయలూస్తూంటే!'

'ఇదేటీగోడబా? మిల్లుపనేటయిందీ?'

'ఆల్లింకా నెల్లాళ్లక్కాని సమ్మె చేయరేసి'

'ఆళ్లంతా పస్లు మానేత్తేనా నాకిప్పిత్తావ్?'

'మరి మనూర్నుంచొచ్చినాళ్లంతా తుడుపులకే ఎల్లారు కదంటరా!'

'అదేంమాట మేస్త్రీగోరూ!'

వచ్చినజనం పోలీసు మద్దతుతో వీధులూడుస్తున్నారు. కూలాళ్లకి మాయమాటలు చెప్పి తీసుకొచ్చినందుకు మేస్త్రీ చేతులికి మురుగులు! కూలాడంటే అందరికీ లోకువే! కాఫీ

కొనుక్కుంటే అయ్యగారికి కోపం! ఎక్కువడిగితే గవర్నమెంటుకు కోపం! పశువులసాలలోకెళ్ళకపోతే పెద్ద కాపుగారు 'హోరి లంజాకొడకా!' అన్నమాటలు పోలీసు యీలల్లా చెవుల్లో గింగురుమంటున్నాయ్. బస్తీలో మిల్లు పనిలో వేయిస్తానని మేస్త్రీ సిమ్మడు 'దొంగకూలిపన్లో వేయిస్తున్నాడు! వీధులు తుడవమంటున్నాడు!

'దొంగకూలీలు' వీధులు తుడుచుకు పోతుంటే సచ్చరాళ్ళు బతిమాలుతున్నారు. ముసిలి సచ్చరాడు వెర్రి చూపులు చూస్తున్నాడు. సచ్చరాళ్ళంతా ఏడుపుచూపు చూస్తున్నారు. గుంపంతా గొల్లుమంటుంటే రాముడు గుండె ఎవరో పిండుతున్నట్లయింది. అందరిదీ వోకటేచూపు! తనతండ్రి మందులేక చచ్చిపోతుంటే తన తల్లి చూసినచూపు! ముసలితండ్రి కళ్ళల్లో తిరిగినట్లనిపిస్తే కిందచతికిల బడిపోయాడు. ఇలాగే తన తండ్రీ రోడ్లూడిచి తనను పెంచాడు. కాని మందు లేక చచ్చిపోతున్నపుడు కొడుకైవుండి తను మందు తేలేక పోయాడు!

రాముడు బిక్కచచ్చిపోయి కణతలు పట్టుకుని నిలబడ్డాడు. కళ్ళమ్మట నీరు కారుతోంది. మూదిమీసం తిప్పుకొంటూ మేస్త్రీ 'నించుంటావేట్రా? సీపురుచ్చుకో! రెండ్రూపాయలూరికే వత్తాయ్!'

చీపుళ్ళు పుచ్చుకుని గాంధీ టోపీలు తుడుచుకు పోతుతున్నాయి; వెనకటి తమ ఉజ్జ్వలపాత్రను భారతదేశ చరిత్ర లోంచి తమకుతామే తుడిచి పారవేసుకుంటున్నట్టు!



# కొత్త పుంతలు

ఊళ్ళో చుట్టల దుకాణాలన్నీ మూసేశారు. చుట్టలు కాల్చే వాళ్ళకి మహాయిబ్బందిగావుంది. పనివాళ్ళంతా కట్టు కట్టి ఊరేగింపులు చేస్తున్నారు. సభలు జరుపుకుంటున్నారు.

చుట్టల్లేక దవడ పీక్కు పోతున్నది. కాలేజీ లెక్చరర్ గారు గంటకి నాలుగుచుట్టలు పెసరకాయల్లా 'ఉఫ్న' ఊదేస్తారు. ప్లీడరుగారికి రోజుకో అరపాతిక చుట్టలు 'మింజుమలె' అవుతాయి. ఆయన సిగరెట్టుతోనే సరిపెట్టుకుంటున్నారు; వంటకి భార్యలేకపోతే వంటమనిషితోనే సరిపెట్టుకుంటున్నట్టు. సిగరెట్లు ఆటేరావడంలేదు. ఇలాయితే యేందారి! వంటమనిషి పోపులికినూనె దూబరా చేస్తోంది. కట్టెలు పట్టెడు తెస్తే పట్టుమని వోపూట రాకుండా వున్నాయి. లెక్చరరుగారి బీడీకి తన సిగరెట్టు ముట్టించి 'అసలీసమ్మె ఎందుకు వచ్చిందాని ...... ఇదిలీగలా యిల్లీగలా?' ప్లీడరుగారు సిగరెట్టు బొడ్డు దులిపారు. ముత్యాల మతాబాలా సిగరెట్టు కాలుతోంది! క్లబ్బు లోపల పేకాట జోరుగా సాగుతున్నాది. రూపాయలు ఖంగ్

ఖంగ్ మంటున్నాయి. పింగ్ పాంగాడుతున్న డాక్టరుగారు 'ఖగ పతి యమృతముతేగా...' అంటూ పాడుతూ ప్లీడరు గార్ద గ్గరకొచ్చి 'తర్వాతేమిటోయ్?' అన్నారు.

'ఏమైతేనేంలే ...... పొగతాగనివాడు దున్నపోతై పుట్టున్'

'ఏదీనో చుట్ట!'

'అంత భాగ్యవాఁ?'

'పెద్ద చిక్కే'

'పైడితల్లి రాగానే అనుకున్నాను; ఈ ఊరికి బ్రహ్మ ప్రళయం తప్పదని' ప్లీడరుగారు ఎక్స్ప్రెషన్స్‌ఇచ్చినట్లు నవ్వారు. ప్లీడరుగారూ పైడితల్లీ వొకగ్రామస్తులు; చిన్న ప్పుడు ఇద్దరూ వీధిబళ్ళో చదువుకున్నారు. ఆసంగతి పైడితల్లి పైకి చెప్పుకుంటాడు. కాని ప్లీడరుగారు మరిచిపోయినట్టువాణ్ని పలకరించమన్నా పలకరించరు!

పైడితల్లి చిన్నప్పట్నుంచీ రణరాలుగాయి. అంత చలి వేసేదా, పొద్దున్నే పొలాలమ్మట తిరిగేవాడు. భోగిమంట వేసేవాడు. ఊరికంతా వాడిదే పెద్దమంట! బాపనవీధి కుర్రాళ్ల నందర్నీ లేవగొట్టి తెల్లవారు ఝామున పొలాల్లో కాలవల కున్న వంతెనల్ని మోసుకొచ్చేవాడు. ఊళ్ళోతలుపులూ తడి కెలూ అన్నీ వాడివే! గోడలకి చరచిన పిడకలన్నీ భోగిమంటల పాలు. ఎంత తిట్టుకున్నా 'తిట్లన్నీ గాడ్దెవుడి' కని పైడితల్లి ఖాతరుచేసేవాడు కాదు. పైడితల్లిని చూస్తే కుర్రాళ్ళందరికీ పెద్దపండుగే. దివాణ ప్రహరీగోడ దూకి ఇంటివిగాంచి ఉడుం

లాగ జరుగ్నజారి నారింజకాయలు అంచీలమీాదందిస్తే కుర్రా
ళ్ళంతా మంటిపుక్కటాల్లాగ తొనలకి సున్నంరాసుకుని తినే
వారు. పైవీధి కుర్రాళ్ళు తనవీధి కుర్రాళ్ళనేవన్నా అన్నారా,
ఆటల్లో వీపు చిట్లగొట్టేశాడన్నమాటే!

తన స్నేహితులంతా చదువుకుని ఉద్యోగాలు చేసు
కుంటూంటే తాను చుట్లకొట్లోపడి కొట్టుకుంటున్నాడు. ప్లీడరు
గార్ని చూసి యిప్పుడనుకుంటూవుంటాడు, 'నాను సదుగు
కుంటేనా' అని. కాని వాడెప్పుడైనా చదువుతేనా? చదివినా
'అబ్బో! అంతేశి సదుగులికి సొమ్మెక్కడ పెగులుద్ది'

బంతిచెట్లుకి నీళ్ళు పోయమని, పాదులకి గొప్పులు తవ్వ
మని మాస్టారు పురమాయింపు. 'పొట్లకాయల్కి రాళ్ళు
కట్టేశేదేటి!' అని యిచ్చకంచేసేవాడు పైడితల్లి. పుస్తకంలో
నెమలికన్ను పెట్టి అది ఎన్నెన్ని పిల్లల్ని పెట్టిందో అస్తస్త
మానూ చూసుకుంటూండడవేఁ వాడి చదువు! 'శాపోడికి
సదువేట' ని పైడితల్లిని పన్లో పెట్టాడు తండ్రి.

పెళ్ళయాక మగాళ్ళకు బుద్ధులొస్తాయి కాబోలును!
'పెళ్ళి పీటమీాద కూకున్న నర్దా యిప్పుడు నేదురా!'

చుట్టలపన్లోకెళ్ళి రోజుకీ అర్ధరూపాయి డబ్బులు సంపా
దించి భార్య చేతిలో పోస్తున్నాడు. ఈపళంగా దోసిళ్ళకొద్దీ
సంపాదించి పెళ్లాంవొళ్లో గుమ్మరించాలని వాడికీవ్వఁది మనసు.
కాని ఎంతపనిచేస్తోన్నా యజమాని 'వందచుట్టకీ అణా పరక
కూలీయిస్తూంటే ఏంసరిపోతుంది? వందకీ బేడ్డబ్బులు 'కూలి

య్యావయ్యా ' అంటే, ఛసేసి ! ఛో ఛో ! అని సాహుకారు గదమాయించాడు !

పైడితల్లి ఎన్నోసార్లు కూలి ఎక్కువ యిమ్మని అడిగేడు. ' ఏట్రో నన్ను రొకాయిత్తన్నా ' వని సాహుకారు గుడ్లురిమాడు. పైడితల్లి సంఘంపెట్టాడు. ' కాకినాళ్ళో సంఘంవుందని దొంగనాకొడుకిక్కడా నెగదీసేసినాడ ' ని చెయిజేసుకోబోయాడు. కూలివాళ్ళందర్నీ కూడకట్టుకుని పైడితల్లి పనులు మానిపించాడు. పొద్దస్తమానూ వంచిన తలెత్తకుండా చుట్టలు చుట్టినా కడుపుకి చాలని కూలి ! ' ఆకలి మాసెడ్డదిరా ! పేదోడింట్లోనే పుడద్ది '

ఆకలి పేదవాళ్ళబొట్టె. పెళ్ళికాని పిల్లలా పేదవాడింట్లోనే వుండిపోతుంది. పైడితల్లి ఎంతపని చేసినా ఆకలితీరదు. ' కూలెక్కువిచ్చినా మీా ఆకల్తీరదు పోరా ' అన్నాడు సాహుకారు. ' ఎంతపన్చేసినా నువ్విచ్చేకూలి వంద కణాపరకా, ఇదేటీ అన్నేయం ? '

వందచుట్టలు చుట్టడమంటే మజాకాలా. బాగా సార్వీసున్న పనివాడైతే రోజుకీ వెయ్యికి పైగా చుట్ట చుడతాడు. కానీ పని మాయముండ ఖత ! ముసిలాడి వెన్నుపూస వంగిపోయి బాణాకర్రలాగయిపోయింది. రూపాయిడబ్బుల సంపాదనలో పావలా డబ్బులు ' ఉడుకునీళ్ళకీ ' మిగతా ముచ్చవకలోనూ పావలాడబ్బులు కల్లునీళ్ళకీ. ఇంకింటికిచ్చేది పావలా డబ్బులు ! పావలా డబ్బుల్తో నానేటి సేత్తాను సంసారం మాయముండ సంసారం ! ' అని పైడితల్లి భార్య లబో లబో

మంటుంది. కల్లో, టీనీళ్ళో తాగకుండా ఏపనివాడూ పనిచేయ లేడు. పైడితల్లి ఈ మాటెంత చెప్పినా వాడిభార్య వినదు !

పొగాకు గొట్టు కొడుతూంటే లగాడీగాడు బ్రహ్మం గారి పదాలు మాసిత్రంగా పాడతాడు. 'ఏమి జలమము ఏమిజలమమూ ...' పాడుతూ శోకసన్నాలు గొప్పవిసురుగా చుడతాడు. రెక్కకి పదునెక్కించి ముసిలాడు చుట్టుకు పోతూంటే గాంధీరాట్నంలాగ వాడిచెయ్యి గిరగిరా తిరిగి పోతూవుంటుంది. వాడికిలాగ పైడితల్లి చెయ్యి తిరగందే! అంత గబ గబా చుట్టినా ముసిలాడి సంసారం రోడ్డుమీాదే!

సాహుకారు చుట్టలంటే చుట్టుప్రక్కల గ్రామాలంతా పేరే!

ఆదివారం సంతకొచ్చి ముందు చుట్టలు కొనుక్కుని తరిమ్మా సామాను తరవాత కొనుక్కుంటారు. ఊళ్ళోని చిల్లర దుకాణాలన్నీ సాహుకారు కొట్లో కాతా. చుట్టిన చుట్ట వొకగంటైనా నిలవుండదు. నిలవ సరుకైతే కొట్టు గొప్పే లేదు. చుట్టంటే చుట్టా! నిల్చి పదునుగా కాలుతుంది. వెన్న ముద్దలాటి తెల్లనిబొడ్డును రాలుస్తుంది. 'మిలిటీరివోళ్ళు మన సుట్ట కాల్చందే తుపాకీ కాల్సివోరటయ్యా!' అని సాహు కారు బేరగాళ్ళతో వెటకారాలాడుతున్నాడు. లెక్చరర్‌గారు, 'నీచుట్ట కాలిస్తే నాలుగుగ్లాసులు మంచినీళ్ళు తాగాల య్యొయ్' అని రిమార్కు లిస్తున్నారు. ప్లీడరుగారు 'నీచుట్ట రుచిమరిగితే చర్చిల్ ఇండియాకి స్వతంత్ర మిమ్మంటాడయ్యా' అని వొకటేవేళాకోళం !

షావుకారు గల్లాపెట్టె గజ్జెలమొలతాడులాగ డబ్బు లోలో ఘల్ ఘల్ మంటున్నది.

అయినా కూలోడింకో అర్ధణా డబ్బులిమ్మంటే షావు కారుకి కష్టంగావుంది. కష్టమనికాదు గాని కూలాళ్ళడిగింది యిచ్చేస్తే ఎంత నామోషిక ! ఇవాళిదయితే రేపింకోటి !

కాని నాలుగురోజులై వచ్చేలాభం నిష్కారణంగా పోతోందని షావుకారుకి దుఃఖఖంగానేవుంది. పైకిమాత్రం మేకపోతు గాంభీర్యంగా 'యింకెన్నాళ్ళు సన్లుమానార్తారో నానూసూత్తాను. తల్లి పుట్టిల్లు మేనమావఁ కెరికే'.

షావుకారన్నట్టు పనివాళ్ళకి కష్టంగానేవుంది. నాలుగు రోజుల్నుంచి దినంగడవడం గండంగానేవుంది. సమ్మెవల్ల ఊళ్ళోనూ యిబ్బందే. కూలోళ్ళకీ కష్టవేఁ, షావుకారికీ నష్టవేఁ. అయినా సరే షావుకారు అర్ధణా డబ్బులిస్తాననడు ! పోనీ ఊళ్ళో వాళ్లైనా 'నీలాభంలో వో అర్ధణా పోతేనేం గాక!' అనరు.

ఊళ్ళో పటాకు చుట్టలు అర్ధణాకి మూడమ్ముతు న్నారు. దవడపీకితే సగం సగం కాల్చిపారేసి లెక్చరరుగారు 'రెక్కాడితే డొక్కాడదు మీకూలి పీనుగులికి ! వన్లోకిపొండ' ని హెచ్చరించారు. 'మా కూలోళ్ళకి రెక్కాడినా డొక్కాడదు' అన్నాడు పైడితల్లి. 'ఈ భూప్రంచమంతా వోచుట్ట చుట్టినట్లు చుట్టేయాల్నుందిరా మీ కూలాళ్ళకీ' అన్నారు ప్లీడగారు.

ఊరేగింపులు, సభలు సాగిపోతూనేవున్నాయి. సభల్లోకి యేంజరుగుతుందో చూద్దామని షావుకారు మనుష్యులు

వస్తూనేవున్నారు. లాభం మాట తల్చుకుని షావుకారు బిక్క మొహంవేశాడు. కూలిలేక ముసిలాడు గిజ గిజ తన్నుకు పోతు న్నాడు. తాగడానికి డబ్బుల్లేక 'ఏఓ సెటకారీ పన' ని పైడి తల్లిమీద కారాలూ మిరియాలూ నూరుతున్నాడు. పైడితల్లి 'నాను మీఅందరి అభిమతవూఁ కనుక్కొని మరీ అడిగినాను'

'మాయిట్టం పెకారం నువ్వు నడుసుకుంటే పన్లోకి పదరా' ముసిలాడురిమాడు.

'సొగంమందెల్లీ సొగం మిగిలిపోతే శానాద్రోహం జరిగి పోతాది!'

'అంతా ఎల్లిపోడమే మందు!'

'ఎందుకేస్సంతతొందరా! నాలోజు లూరుకుంటే వొండకి బేడా ఆడేయిత్తాడు పుచ్చిన కుక్కలాగ'

'తొందరెందుకంటావేటోయ్? సస్తావుంటేను'

పైడితల్లి కేమీ పాలుపోలేదు. షావుకారు మను ష్యులు కూలివాళ్ళ వెంట నీడల్లాగ తిరుగుతున్నారు. ఇవన్నీ విని షావుకారు మరింత కొమ్మమీదకి పాకి కోతిలా కూచుం టాడు. కొమ్మమీదున్న కోతిని దింపడంమాటలా!

ముసిలాడికీ వాళ్ళకీ 'తాగడానికి డబ్బులిస్తాను రమ్మన' మని పాతికమందిని పనుల్లోకి తీసుకుపోయాడు. పండు గలికి ఈనాములిస్తానని ఆశపెట్టి కూలీలను లాగుతున్నాడు. నాలుగురోజుల్లో పన్లోకి అంతా వెళ్లిపోతారు. అంతా వెళ్ళి

పోతే తనూ వెళ్లాలి. ఊళ్లో పదిమందీ చప్పట్లు కొడతారు. అణాపరక కూలే కలకాలవ్వూఁ సాహుకారిస్తానంటాడు!

గుల్లసున్నంలో నీళ్లుపోస్తే ఉడికినట్టు పైడితల్లి కుత కుతమన్నాడు. 'ఈ ఏల ఎట్టినా రేపు తిట్టినా సావుకారేన్రా!' అని సాహుకారు మనుష్యులు కూలాళ్ళకి చెపుతున్నారు. 'అదికాదు పేసీ! నాకు సాల్దని అడిగితే ఆమూరాజే యిత్తాడు. పైడితల్లిగోడి మాటెని ట్రయికేటని? సాహుకారు మను షులు నచ్చచెబుతున్నారు. పైకిలేసుకుని రెండుమూడు సార్లు పోలీసాయన పైడితల్లి వీధికొచ్చి కొందర్ని భయపెట్టేడు!

చుట్టకాల్చుకుంటూ పైడితల్లి వీధిమ్మట వెడుతూంటే బాపనాయనకి వీధరుగుమీద గడ్డంగీస్తూ గీసిన వెంట్రుకల్ని సబ్బునురగతో చేతికి పాముకుంటూ 'మాగొప్ప స్ట్రెయికు సేయించేసినావయ్యోఁయ్! అమల్దారీజరిపేస్తున్నా వమల్దారీ!' మంగలిమంత్రి నవ్వేడు. బాపనాయన అద్దంలో మీసంచూసు కుంటూ 'వంకరగా కత్తిరించావురా మీసం!' అన్నాడు. మంత్రిమాటలు విని పైడితల్లికేసి తిరిగి చూసి పెదెం విరి చాడు. పైడితల్లిమనసుకు కత్తిగంటు పెట్టినట్లయింది. నొచ్చు కున్నాడు. పక్క-సందులోంచి వాడిభార్య తవుగోల పట్టుకుని వస్తూ పైడితల్లిని చూసి ఆగింది. ఆగింది వూరుకోక అడిగింది 'ఇంకెన్నాళ్ళీ గొడబా?'

పైడితల్లి చుట్టకాలుస్తూ ఆగిపోయాడు. చుట్టకాలుస్తున్న వాడివంక దేబెగా చూస్తుంటే కాలుస్తోన్న చుట్టపీక అందిం

చాడు. సుట్టంటే మా సెద్దకుతి. అడ్డపొగ పెట్టి ఊరవతల పొలా ల్లోకి గడ్డితవ్వడంకోసం నడుస్తోంది.

'అవసరంపడింది. మాపిటికి మా సెల్లెల్నడిగి నానుకోళ్లు పట్రాయే' అన్నాడు.

'ఎందుకుకోయ్. డబ్బు పాపిట్టి'

'యేపారం ఎడతాను'

'ఏయాపారం?'

'ఏదోయాపారం; బతకద్దా?'

అలాగే తెస్తానన్నట్టు బుర్ర ఊపి వాడిభార్య చింతచెట్లు నీడల్లోంచి రైలురోడ్డు ఎక్కింది. పైడితల్లి తాను పెట్టబోయే వ్యాపారం గురించి ఆలోచిస్తున్నాడు. వీశపుగాకూ సాహు కారు మూడున్నరకి తెచ్చి తుక్కుపొత్తు కలిపి రూపాయన్నర లాభానికి చుట్టలమ్ముతున్నాడు. రోజుకి ఏడెనిమిది చుట్టల పుగాకు చుడితే యింకా సరుకు సప్లయిలేదంటున్నారు. రోజుకీ సాహుకారికి ఎంతలాభం! ఇంటద్దె, కొట్టద్దె, నౌకరివాళ్ల జీతం ఇవన్నీ పోను సంసారం నిర్వాచిగా సాగుతున్నాది. చీటీలమీద వేసిన డబ్బుతో పొగాకు వ్యాపారం మొదలుపెట్టి ఎంతఆస్తి పరుడయ్యాడు! చేతికి బంగారపు గొలుసూ, వాచీని!

పైడితల్లి పనివాళ్ళందరినీ పిలిచి రావిచెట్టునీడని కూచో బెట్టాడు. సభలో సాహుకారు మనుషులూ వున్నారు. పుగాకు వ్యాపారం పైడితల్లి ఆరంభిస్తున్నాడని పుకారు! 'సూద్దాం! యీడేపారస్తుడైపోనాడే!' అంటూ అరుగుమీద కూచు న్నాడు మంగలి మంత్రి. 'గొప్పసిత్రవే! అటు కూలోళ్లకీ యిటు పావుకారికీ మాగొప్ప జెల్లకొట్టేసినాడు'

ఈ సారి మునపటి షాహుకారులాగే పైడితల్లీ వ్యాపారస్తుడౌతున్నాడు. కూలాళ్లకి హెచ్చుకూలిచ్చినా వాడికి లాభమే! ఇన్ని నీతులూ చెప్పి పైడితల్లి షాహుకార్లల్లో కలిసి పోతున్నాడు!

'లీడరుషిప్పుని నమ్మలేమోయ్!' అంటూ లెక్చరరు గారు ఆర్థికశాస్త్రాన్ని, మార్కెట్టునీ, రాజకీయాల్నీ తిట్టి తిట్టి పోశారు.

'అంతే అంతే! తీరా ఎక్కాంతర్వాత నిచ్చెన తన్నేస్తారు లీడర్లు' అన్నారు ప్లీడరుగారు.

పైడితల్లి కూలాళ్లనందర్నీ పిలిచి తలో రెండూ్రిపాయలూ చందా వేసుకోండన్నాడు. 'మొత్తంసొమ్ము మన్ది కాదనుకొని పోకొడదాం' అన్నాడు. ఈ డబ్బుతో పుగాకు చట్టలు తెచ్చి చుట్టలు చుడదాం రమ్మన్నాడు. అమ్మకుంటే వందకీ మూడణాలు కూలి కిట్టగా అర్ధణాకీ వోచుట్ట హెచ్చు అమ్మొచ్చునన్నాడు. అలాగమ్మినా నెలకీ నూటపఖైపైని లాభం వస్తుందని చెప్పేడు. అంతాకలిసి వో పెద్దసాలవేసి లేబరు చుట్టలు అమ్మదాం, తకల్లేదని లెక్కలు వేశాడు. ఈ సారి షాహుకారు పావలా యిస్తానని పిల్చినా వెళ్ళక్కల్లేదు. లాభం ప్రతియేడూ అందరికీ సమానంగా పంచుకోవచ్చును!

ఇప్పుడు ఊళ్ళో చుట్టల కరువులేదు. చవక! చవక! కారుచవక! అర్ధణాకి అయిదు! చుట్టలంటే చుట్టలా. లేబరు చుట్టలు!! 'లేబరు సుట్టలూ! సవకా సవకా!' అని పైడితల్లి అమ్మతూంటే సరుకు ఒక్క నిమిషమైనా నిలవవుండదు!

ఆదివారం సంతకొచ్చి పల్లెటిజనం తీరుబడిగా లేబరు చుట్టలు కొనుక్కుని పోతున్నారు. పూర్వపు షాహుకారు కమిషనువీూద లేబరు సంఘంలో కొనుక్కు లాభానికి చిల్లరదుకాణం పెట్టు కుని అమ్ముకుంటున్నాడు. వ్యాపారం మార్చి అల్యూమినం కొట్టుపెట్టినా చుట్టల వ్యవహారం అచ్చొచ్చిందని మాన్లేదు!

ముసిలాడు 'కూలోళ్ల గొంతులో ...' అని పదం పాడుతూ చుట్టచుడుతూంటే చెయ్యి యంత్రంలాగ గిర గిరా తిరిగి పోతున్నాది.

లెక్చరరుగారు లేబరుచుట్ట అంటించి 'ఇంత కారుచవగ్గా వీళ్ళకెలాకిడుతున్నాయీా అని' అంటూా ఆర్థికశాస్త్రాన్ని మనసులోనే దులుపుకుంటున్నారు. ప్లీడరుగారు రైలింజనులాగ గుప్పున గుప్పెడు పొగ వొదుల్తూా 'నే నాడే చెప్పాను. పైడి తల్లి ప్రళయం తీసుకొస్తాడని!' అన్నారు!



# అన్నదమ్ముల పంపిళ్లు

చాలా రోజుల్నుంచి తమ్ముడికి వేరుండాలనివుంది. ఆనాళ్ళనుంచీ అన్నాతమ్ముడూ సమిష్టిగానే వున్నారు. అప్పటికింకా తమ్ముడికి మైనారిటీ తీర్లేదు. ఇంకా చదువుకుంటూనే వున్నాడు. అప్పుడు కనక చీటికీ మాటికీ అన్నయ్యని 'కోటు కుట్టించుకుంటానన్నయ్యా!' అని డబ్బులడిగే వాడు ...... అబద్ధమెందుకూ? మొహందగ్గరొకమాటా, మొహంవెనకాలొకమాటా ఆడకూడదు. అబద్ధమాడితే ఆడపిల్లలు పుడతారు!

అడగడమే తడువు; అన్నయ్య ఎంత కావాలిస్తే అంతా తీసి 'ఇందరా లెక్క' అనేవాడు. అన్నయ్య గులాబిపువ్వు; తమ్ముడు జాజిపువ్వు.

అయితేనేం, అన్నయ్య సంసారం పెద్దదైంది. వొదినెగారు రెండేళ్ళకోసారి వురిటికి పుట్టింటికెళ్లి వస్తోంది. చనివిడీ కొబ్బరికాయలతోపాటు చంటిపిల్లవాణ్ని చంకనేసుకు వస్తోంది. పిల్లలకి సిల్కు పరికిణీలు, చిల్లరతిళ్లూ, పాంకూసం వంటి

అన్నగారి బట్టలూ మధ్య మధ్య వచ్చీపోయే పుట్టింటివంక చుట్టాలూ! ... అయినప్పటికీ యింతవరకూ తమ్ముడు సమిష్టి గానే వున్నాడు. ఉమ్మడి ఖర్చులకిందనే యివన్నీ లెక్క కట్టు కుంటున్నాడు.

వదినెగారు పొద్దున్నే లేస్తుంది. ఇల్లు తుడుస్తుంది. నీళ్లు జల్లుతుంది. ముగ్గులు పెడుతుంది. పాలుపితుకుతుంది. నీళ్ళు తోడుతుంది... ఆవిడ చేయని పనిలేదు. పనిమనిషినన్నా పెట్టుకోకుండా చవిటి కొంపని అద్దంలా దిద్దుతుంది. తల దువ్వు కోదు. చీరెమార్చుకోదు. మార్చుకున్న చీరె యిట్టే మాసి పోతుంది. లంకంతయింటిలో రాక్షసచాకిరే! చేయలేక చస్తు న్నాది!

'ఎప్పుడూ నీకు పనేనే... వేళపట్టున భోంచేయ వేవేఁ! ...... అంతపెద్ద చేదతో నీళ్ళుతోడుతావెందుకూ? ...అన్నా ... ఇంక చేసుకోలేవ్! మా చెల్లెల్ని రమ్మని రాసేదీ? ... వెధవా ఊరుకోరా! అమ్మనెందుకురా అలా కాల్చుకు తింటావ్? ... ఉహుహు! నువ్వూరుకోవే, నేనిప్పు తానూ ... వెధవ గేది, కుమ్ముతుందేమో!' అన్నయ్య చీటికీ మాటికీ యిలా అంటున్నా ఆవిడ వంచిన నడుంఎత్తదు. అమలాపురం చెల్లెలు పిల్లలతో సహా ఏడాది కొర్నెల్లు పుట్టిం టనే తిష్ట! రెండో అక్క మొగుడు తన కుద్యోగం అయేవరకు పెళ్లాన్ని తీసుకెళ్ళనని యిక్కడే విడిచేశాడు. పెళ్లికానపుడు పుట్టింట అదొక తృవుండేది. ఇప్పుడు పిల్లల్తో వుంటున్నది. ఇంతేతేడా! 'ఐమైరావణ సంతచేసుకోలేక చస్తున్నానమ్మా' అని అంటూనే వుంటుంది వదినె, మళ్ళీ చేస్తూనేవుంటుంది.

తన పిల్లలూ తన సంసారవేఁకాక ఆడపడుచులూ పిల్లలూ...
ఆడపడచన్నా పిల్లలన్నా అగ్గగ్గలాడుతుంది; పిల్లలు దెబ్బ లాడుకుంటారు; జాంపిండెల కోసం జుత్తూ జుత్తూ పట్టు కుంటారు. చొక్కాలు చింపుకుంటారు. అన్నాలు కుమ్మ్మ కుంటారు. ఎవర్నీ నిద్రపోనీయరు; కూచోనీయరు; నిల బడనీయరు. ఆడపడుచు బిడ్డలు తన బిడ్డల్ని వుత్తినే గిల్లినా, రక్కినా, కరిచినా, కొట్టినా, వొదినెవాళ్ళనేమీ అనదు. పై పెచ్చు 'వెధవల్లారా, వంచాళింపుండక్కర్లేదూ?' అని తన పిల్లల్నే తట్లుతేలేటట్టు వీపుమీద నాలుగు చరిచి అవతలికి పంపిస్తుంది. ఏడిస్తే నోరు నొక్కుతుంది. పెద్దవాడు మాటకు మాటా చెబతాడు. తల్లిని నువ్వెంతంటే నువ్వెంతంటాడు. కొట్టవస్తే నూతిచూట్టూ తిప్పుతాడు. కొడితే మళ్ళీ కొట్టబో తాడు. వదినెవ్వుడుక్కుని 'రాలగాయివెధవ, పుట్టి రెండూ పుట్టక రెండూ నేర్చాడమ్మా! అయినాకానీ, ఆమనిషికి బుద్ధీ, జ్ఞానం వుండక్కర్లేదటమ్మా... తండ్రిదగ్గిర లేని భయం తల్లి దగ్గిరుంటుందా? ... రానీ ... మీ నాన్నని రానీయ్' అంటుంది. నాన్నవస్తాడు. 'గుంటవెధవ, పేట్రేగిపోతున్నాడు. మొక్కైవంగందీ మానైవంగుతాడా?' అని గోలచేస్తుంది. నాన్నకొడుకు చవఁడాలూడదీస్తాడు.

ఈ సంసారం ఎప్పుడూ యింతే. ప్రాణానికి సుఖంలేదు. వేరుపడితే యింతఖర్చూలేదు; ఇంతగోలా వుండదు! అను కున్నాడు తమ్ముఁడు.

వేరు అనేమాట తలుచుకుంటే తమ్ముఁడికి మనస్సు చివుక్కు మనక పోలేదు. వొదిన మంచిదీ; అన్నయ్యమనసు

గులాబీపువ్వు. తల్లి పోయినప్పట్నుంచీ వొదినె చాటునే పెరి గాడు; పెద్దవాడయ్యాడు. తన కూష్టంవస్తే ఆవిడ తన కన్న కొడుకులా చూసుకుంది. వొదిగి వొదిగి మరిదికి అన్నీ అమర్చి పెట్టేంది. అన్నయ్యకీ తనకీ ఏమైనా మనస్పర్థలొస్తే ఆవిడ తన పక్షమే వహించేది. వొదినె మంచిదే; అన్నయ్య మనసు గులాబీపువ్వు!

'అమ్మో అత్తిగ అలావుందని చూస్తున్నావేవిటి? నంగనాచీ వంగముల్లూను!' తలదువ్వుకుంటున్న తనచేతికి పన్నె అందిస్తూ చెల్లెలు చాడీలు చెప్పింది. 'చాటు చాటుగా బియ్యం అమ్ముకోందిరా!... ఆవెర్రి పీనుక్కేవీ తెలీదూ! పెళ్లాంపదిలేదంటే అది తెచ్చి పడేయడవే కాని 'యీ వస్తు వుయిన్నాళ్లే వచ్చిందేం'? అని అడగడే వాడు!'

'పోనిద్దూ ... అమ్ముకుని అదేంచేసుకుంటుందీ?'

చిన్నక్క కాస్త చొరవా అధికారం తీసుకుంటూ 'గుంట పాడెగట్టా! వేరుండు. ఆనక ఎల్లయ్యకి ఎళ్లూ లేవు; మల్లయ్యకి మళ్లూవుండవ్' అని ఎగసంతోసించి. పుల్లారెబుడ్డిలా చెల్లెలుమధ్యకువచ్చి 'మనకెందుకే; ఆనక అన్నీ వాడికే తెలు స్తాయ్!' అన్నది. 'నాకు పిల్లాపీచా? తొందరేవుందే?' అన్నాడే కాని తమ్ముడు వీసానికి వీగలేదు.

కాని ఈనాడు తమ్ముడు వేరుండాలనుకుంటున్నాడు. అదేవిచిత్రంమరి! వేరుండాలనేకాదు, అక్కచెల్లెళ్లు చెప్పినట్టు ఆనాడే వేరుంటే యీ పాటికి ఎంతోమిగులును గద! అను

కున్నాడు. వేళపట్టున యిన్ని మెతుకులు తినాలన్నా, నాలుగు రాళ్లు వెనకవేసుకోవాలన్నా. తన ఆస్తిపాస్తులు పొదుపు చేసుకోవాలన్నా వేరుండడం తప్ప గత్యంతరం లేదనుకున్నాడు.

తనకీ పెళ్లయిందా మరి! దానమ్మకడుపు కాలిపోనూ, పెళ్లాం పిల్లలంటూ వున్నాక నోసినీమాకెడదామనీ, పువ్వులు కొని పెళ్ళాని కివ్వాలనీ, మనిషయాక ఆమాత్రం ఖర్చవకుండా వుంటుందీ! లోపాయికారీగా సంసార్ల కెన్నెన్ని ఖర్చులుంటాయ్. మనసువిప్పి చెప్పాలంటే ఈ వెధవకొంపలోంచి బయటికి పోయి ఓ చిన్నబంగాళా కట్టుకోవాలనివుంది; మరి ఏమనుకున్నారో కాని!

పెళ్ళాం ఓవల్టిన్ తాగుతానంటే 'అలాగే' అండానికి తనకు మొహంచెల్లిందికాదు. 'సినీమా కెడతానండీ' అంటే 'రేపువెళదాంలేవే' అని వాయిదావేసేడు. రేపు. ఎదవరేపు. గోడమీద రేపు!

'చూశారా, విశాలాక్షి కొనుక్కుందీ చీరె ... అడ్డుగళ్ళు బాగున్నాయి సుమండీ! నేతకూడా చిక్కనే ...' అని భార్య కాంతా సమ్మితమైన కావ్యంలాగ ధ్వనించింది. తాను కార్టూన్ పద్యంలాగ మొహంపెట్టేడు!

సంసారం పెద్దదవుతోంది. పిల్ల ఎక్కువ బిస్కట్లు తింటూంటే 'ఆకలికూటిముండే .... ఎవరి పోలికో కానీ' అని తను పోలికలు సరిపోల్చి చూశాడు. పెద్దపిల్ల సంగీతం నేర్చుకుంటానంటే 'మనకి ఆనవాయితి లేదమ్మా' అన్నాడు.

వీటన్నిటికీ 'అడగనామానా్న' అని ఆలోచించి ఉమ్మడి చిట్టాలో రాయించడం 'బ్రమ్మిశ్టి బ్రమ్మాండం !'

అన్నయ్య యివ్వడనీకాదు. ఏవన్నా అనుకుంటాడనీ కాదు. అదేవిటో అడగాలంటే నోటమ్మాట మాటేరాదు. వాళ్లు చచ్చిపోయినట్టవుతుంది' ఎంతుంటే అంతే ఆయెను. నాదీ అని నిక్కచ్చిగా వున్నదేదో వేరుపడితే కాస్త ఊపిరి పీల్చుకోవచ్చును. అన్ననడుగుతూ దొప్పకింద దొప్పలాగ బతుకుతున్నంతకాలం వొక ఊపిరితిత్తే గాలి పీలుస్తోంది. కాని అప్పుడు స్వేచ్ఛ, కాస్త అధికారం నాదనే ఆసక్తీ వుంటుంది కనక రెండూపిరితిత్తులూ పీలుస్తాయి గాలి !

తన అన్న, తమ్ముడి సొమ్ముతినకూడదనా ? అబ్బెబ్బే ! అలాంటిదెప్పుడూ లేనేలేదు. కాని అన్నపిల్లలు పెళ్ళీడు కొచ్చారు. వీళ్లందరికీ ఉమ్మడి ఖర్చులమీద పెళ్లిళ్లుచేస్తే తీరా తన పిల్లలు పెళ్ళీడు కొచ్చేసరికి ఏమీ మిగలకపోతే ? కుర్రాళ్ళుంటూ వున్నాక వాళ్ళకి చదువనో సంధ్యనో చెప్పించకపోతే చెట్టుకో పిట్టయ్ పోరూ !

ఏదో నాలుగురాళ్ళు వెనకవేసుకోక పోతే నడుంవంగిం తర్వాత చాకిరీ చేయడానికి ఎవరు పలుకుతారు ? ఆనక దప్పిక పోయడానికి అమ్మాబాబా ! బాదరబందీలు బకేడాలూ లేనప్పుడు తన సొమ్మెవరు తిన్నా తకరులేదు.

పోనీ అన్నగారైనా సుఖపడుతున్నాడని ఏనోటితో అనగలం ? వాడిమనసు నవనీతం ; ఇట్టేకరిగిపోతుంది.

పొద్దున్నే లేస్తాడు. చద్దన్నంతింటాడు. తిని పొలంలోకి పోయి పాలేర్లా కష్టపడతాడు. ఎండకి ఎండి వానకు తడుస్తాడు. పాపం వాడికి చిన్నప్పట్నుంచీ కష్టాల జాతకనే. ఉమ్మడి ఆస్తి కోసం చుట్టాలుపెట్టిన నానాకష్టాలకీ ఓర్చి కోర్టమ్మట పట్టరాని వాళ్ల కాళ్ళా పట్టాడు. అన్నయ్య మనసు గులాబీపువ్వు. వొదినెది జాజిపువ్వు.

పొద్దున్నే తను కాఫీ, టీ కావాలంటే అలాకాచి యిస్తానే వుంది. నీళ్లు పోసుకుందుకు పుల్లలు లేక పోయినా కొబ్బరాకులతో వేణ్ణీళ్లు కాగబెడుతుంది. వాళ్లా యన కంటే మరది కొంచెం వస్తువులన్నీ శుభ్రంగావుండాలం టాడు కనక, తినే సామానుమీద మూతలూ అవీపెట్టి జాగర్త చేస్తానేవుంది. ఆ మాటకొస్తే తను ఎలాపడితే అలాగ అన్నగారిలాగ తినివెడుతున్నాడు కనకనా! ఏ కూర కావా లంటే అదే చేస్తోంది. వొకళ్ళకి వేపుళ్లా, యింకొకళ్ళకి ముద్దకూరలూ, మరొకళ్ళకి చప్పిడి పచ్చళ్లూ చేస్తోందికదా! ఆవిడలా చాకిరిచేయడానికి మనిషా, మానా? వీళ్ళందరికీ అంగరక్షలు పెట్టడానికీ, కూచోబెట్టి సేవచేయడానికీ, ఆవిడే నైనా అన్చిందా?

ఇంతమంచియిల్లాలు మరిది వేరైపోతున్నాడని ఏం అను మానంపడుతుందో కదా! అన్నగారు పెడర్థం తీసుకుంటే కావల్సినవాళ్ళేలాగ వస్తారు.

అలా అనే అన్నకూతురి పెళ్లి ఉమ్మడిగానే చేశాడు. తనే వెళ్లి కట్నం కుదుర్చుకొచ్చి విడిదికి గదులన్నీ బాగు

చేయించాడు. సన్నాయి మేళం కుదిర్చేడు. చీరెలూ చాపులూ పిసినిగొట్టుతనం లేకుండా మంచివే ఖరీదు చేశాడు. బాణ సంచా సామాను సమంగా వెలగడం లేదని తయారు చేసిన వాళ్ళని కూకలేశాడు. పన్నీరు బుడ్డీ తనేపట్టుకుని పందిట్లో పదిమందిమీద చిలకరించాడు. పెళ్ళికొడుక్కి కోపం వస్తే మరో నూటపదహారు వేసి సైకిల్ కొంటానన్నాడు. వేళకి అన్నీ అలాగ చిటికెలమీద అయిపోయేలాగ అన్నీ సిద్ధంచేసి పెళ్ళంటే ఫలానా వారింట్లోనే జరగాలి సుమండీ అనిపించుకున్నాడు. 'సెభాష్, విస్తరి వరహావిలవ' అన్నారే కాని అంతా, వొక్కరుకూడా యిదేమి భోజనాలన్నారా! ఎంత ఖర్చయిందో ఎంతవుందో అన్నని జమా ఖర్చులు రాయ మన్నాడా! ఆ వూసే ఎత్తలేదు!

ఇంకిలా అయితే తనపిల్లలకి తీరా పెళ్ళిడొచ్చేసరికి అంతా ఏష్యమైపోతుంది. ఎవరిదారి వాళ్లదీ! వేరుండడం లోక సహజం. అన్నదమ్ముల్లో రివాజే!

మాటమీద మాటొస్తే జ్ఞాపకమొచ్చింది. వొదిన ఎంత మంచిదైనా, కొంచెం పైపిల్ల పైపిల్లే. ఈ ఇళ్ళల్లో మరిదికి పెళ్లి కానంతసేపూ ఓలాగ, పెళ్ళయి తోటికోడలు కాపరాని కొచ్చేక మరోలాగా వుంటారు. తోటికోడళ్ళిద్దరికీ పడాలి. మొగాళ్లూ మొగాళ్ళూ వొకటయినా ఆడాళ్ళకి ఆడాళ్ళకీ సరిపడకపోతే చచ్చినొచ్చావు.

ఇంతకీ వొదిన చెడ్డదనికాదు; ఉమ్మడిగా వుండటమే అలా చేసిందేమో! తన మొగుడు మహా కష్టపడిపోతున్నాడనీ

తనకి తీరికన్నదేలేక తడిమడిబట్ట వొంటినే ఆరిపోతున్నదనీ ఉమ్మడిగా తమకే హెచ్చు ఖర్చవుతున్నట్టూ ఆ కాకిమీదా ఈ కాకిమీదా పెట్టి నానా మాటలూ అంటూనేవుంది.

తన భార్య మాత్రం తక్కువ తింది కనకనా ? ఏడాకు లెక్కువే చదివింది. ఎందుకొచ్చిన మాట. ఏమాట కామాటే ఆడాలిగదా ! తన మొగుడే మహా కష్టపడుతు న్నట్టూ తన ఆస్తేమీ తృణమైనా తనకేమీ ముట్టడమేలే నట్టూ వొంటెత్తుగానే వుంటోంది. ఎల్లమ్మని ఎంచాక్క ర్లేదు పోలమ్మని పొగడాక్కర్లేదు.

ఇంకా ఈ విచిత్రం చూశారుకాదు ! తనే పెట్టుబడి పెడుతోంది కనక తనవంతల్లా సుష్టిగా భోంచేసి ఎంగిళ్ళయినా ఎత్తకుండా చేతులు కడుక్కుని తుర్రున పిట్టలా గూట్లోకి పారి పోవడ మనుకుంటోంది. పగటిపూటా యిదే పని. రాత్రిళ్లా యింతే. 'రెండు పూట్లా అందరెంగిళ్లూ ఎత్తిపారబోయటా నికి నేనేమన్నా వంటలక్కనా ఏమిటే మంగమ్మా' అంటోంది వదినె. మంగమ్మ ఏడాదికోసారి బావగారి పిల్లలిచ్చే మనో వర్తిమీద బతుకుతోంది. నాలుగుమాటలు సాయంచేసి తోటికోడళ్ళకు జట్టీ పెడుతుంది.

రాత్రిళ్లు భోంచేసి మరచెంబుతో మంచినీళ్లు పట్టుకొని తన యిల్లాలు తన గదిలోకివచ్చి వాలుతుంది. పసుపు కాళ్ళతో దుప్పట్లల్లా పాడుచేస్తూ దర్జాగా పరుపుమీద పవ ళించి రాసుకుంటోన్న తనను మహా యిబ్బంది పెడుతోంది. 'ఏమిటండీ మీ తెలివితక్కువతనం ? మీనుంచే నాక్కీలోకువ.

లోకువ్వాడి పెళ్లాం వాడల్లా వదినయిందిట ! ... మీా వదిన గారి కంటికి మేం కీటకాలం కామోసు ! '

' ఏమొచ్చిందేవిఁటే '

' తనభర్తగారేమో నానా శ్రమదమాదులూ పడు తున్నాట్ట ! వ్యవసాయం పెట్టాట్ట. పంటలు పండించి గోచ్చేలు గోచ్చేలు సంపాదించి పోసేస్తున్నాట్ట. '

' ఇకనేం ? గడించినవాడి పెళ్ళాం గారీదేవి. సంతోషించమను ! '

' బాగుంది, బాగుండి!... ఆవిడనే దేవిటో తెలుసునా ! తన మొగుడు తన తమ్ముడికి రాసులకి రాసులు పండించి పోస్తు న్నాట్ట !'

' ఏడవమను ! '

ఆమర్నాడు వొదినెగారు దంపులాళ్ళతోటి 'దీనికింత అతిశయమేమిటే ? ఇది బొడ్డున మాణిక్యం పెట్టి పుట్టిందా, నేను పుట్టక పోయానా ?' అనడం తనూ విన్నాడు.

తోటికోడళ్ళిద్దరికీ జట్టీలు లావయినాయి. ఇద్దరి మధ్యా పచ్చిగడ్డేస్తే భగ్గుమంటోంది. ' ఏం నేనేం తేరగా దొరికానా, దీనికీ దీని పిల్లలకీ చాకిరీ చేయడానికీ !... నాకేం చేస్తోందీవిడ చాకిరీ ! నలుగురం మనుషులం లేం. వేరుంటే మా ప్రాణమూా తెరిపిన పడుతుంది. ఆవిడకీ హాయిగావుంటుంద ' ని తనభార్య పాకలో అచ్చితో చెప్పి వచ్చింది. సంసారాల్లో పనిమనుషులే పోస్టు జవాన్లు !

'ఆయన్నింటికి రానీయవే అచ్చీ! నాకెందుకీ చిత్త క్షోభ ?' అన్నది వదినె. 'అదేవిటమ్మా. అంతగడుసుతనం ఆవిడికి. తల్లి మాలచ్చివిఁ, అత్తగోరు పోయినప్పట్నుంచీ దిద్దుకొస్తున్నావ్ కదమ్మా సంసారం! అత్తగోరు లేనిలోటు కనపడద్దమ్మానీ యింటో! ముందు నిన్ను సెప్పి ఆవిణ్ని సెప్పాలి... తల్లి ఎంకాయమ్మగోరు పొద్దున్నే లేసి ఆవిడ పేరే తలవాలితల్లీ! సేశికెవిఁక లేదుతల్లికి!'

వదిన పెట్టిన ఊరకాయ ముక్కపట్టుకెడుతూ అచ్చి 'ఏటమ్మా ఆరంతోరారూ; మీరొంతోరు మీరూ!' అంటుంది.

చిన్నకోడలు సాయంకాలం వీధిలో ముస్తాబై నిలబడితే మంచినీళ్ళ బిందె దింపుకుని మరీ అచ్చి 'అదేమిటమ్మా అంత గోసి పీచూ...తల్లియిల్లో నారాయణమ్మ ... ఎంగిలిసేత్తో కాకిని కొట్టదమ్మా ... ఇంటికి పెద్దకోడలనేమాటేకాని మీ అత్తగోరి పేరేరమ్మా! ఈ ఏడు పంటలు మా బాగా పండేయి బుల్లెమ్మగోరూ...'

'ఏం పండితే ఏంలాభవేఁ?'

'అదేటమ్మా! బంగారంలాటి పొలం!'

'సారే!'

బుల్లెమ్మగారిచ్చిన పాతకోక పట్టుకుని పోతూ పోతూ 'వాళ్లు సెబితే పత్తదేటమ్మా దానగుణావూఁ! పెద్దింటోరు పెద్దింటోరే!' అంటుంది అచ్చమ్మ.

మంగమ్మ మనోవర్తి తెచ్చుకుంటోంది. అచ్చమ్మ హాయిగా కాపరం చేసుకుంటోంది.

తోటికోడళ్ళు వాళ్ళమీద వాళ్ళు వంతులు పెట్టుకుని పనులన్నీ మురగబెడుతున్నారు. ఇంతకీ వాళ్ళనని లాభమేమిటి. సంసారం ఎవరికీపట్టింది కాదు! మగవెధవేంచేస్తాడు. లేదంటే నాలుగూ కొని ఇంట్లోపారేస్తాడు. పారేస్తే ఆడదన్న తరవాత జాగర్త చేసుకోవాలి. పొదుపు చేసుకోవాలి. దేనికది యిమ్మ చేసుకోవాలి. నిన్నకాక మొన్న మొన్న నెల్లాళ్లు కాలేదు. మావిడిచెట్టు కొట్టించేడు. అప్పుడే పుల్లలు సంగోరు హారాయించేశారు. ఆవిడోసారి వేణ్నీళ్లూ ఈవిడోసారి వేణ్ణీళ్లూ. ఒదినగారు నెల్లాళ్ళకోసారి తలంటుకుంటే తన భార్యామణిగారు వారానికోసారి! పెద్దకోడలుగారు జంతికీలువండితే చిన్నకోడలుగారు మైసూరుపాక్‌లు చేస్తోంది. తోటికోడలు మల్లెపూలు కొనుక్కుందీ అంటే తన పిల్లలు 'వొద్దులే! ఇంకా వున్నాయ్ కదటే' అంటున్నా 'కొనుక్కోండి వెర్రిపీనుగుల్లారా!' అని బతిమాలి తిట్టి కొనిపిస్తోంది తన పెళ్లాం!

ఇల్లు గుల్లయిపోతోంది. పాపం! వాడుమాత్రం యెక్కణ్నుంచి తెస్తాడు? ఏది కావాలంటే అది కొండమీంచి కోతిని దింపుకు వస్తున్నాడాయెను! అయినా యింత సొమ్మూ ఏవీ కానట్టు గయివిలా అయిపోతోంది!

ఎందుకొచ్చిన చిత్తక్షోభ! ఎవరికివారు వేరుంటే 'ఇది నాదికదా! జాగర్త చేసుకోక పోతేఎలాగ'ని అంతా అను

కుంటారు. 'పిల్లలుగలవాళ్లం యింతంత లేసి ఖర్చులయితే మరేవన్నా వుందా?" అని సంసారంపొదుపుచేసుకుంటారు. వున్న నాడుతింటారు. లేనినాడు పస్తులుంటారు. ఎవరిచాకిరీ వాళ్ళు చచ్చినట్టు చేసుకుంటారు. అప్పుడిద్దరిసంసారాలూ తిన్నబడ తాయి. సరే, అన్నాతమ్ముడూ అయాక వేరుండడం సహజమే!

వేరున్నంత మాత్రాన కొట్టుకోవ నెక్కడుంది శాస్త్రం? అన్నదమ్ములయాక ఎవరికి వాళ్లు వేరూవుంటారు; వొకరికొకరు సహాయమూ చేసుకుంటారు. అన్నయ్య వచ్చాక వేరుండడం యిద్దరికీ మంచి దేనని నచ్చచెప్పాలి. వొదినెక్కూడా ముందే చెపితే వచ్చేముప్పేమిటి? ఆవిడకు పాపంఎప్పుడూ పనే !

రాకాసిముండావంటూ, రాకాసిముండాతిట్లాను. ఎప్పుడూ తీరికే వుండదు. విశ్రాంతీలేదు. సుఖమూలేదు. వేరుంటే అంతా చులకన పడుతుంది. ఆవిడకీ సుఖమే! పొద్దున్నే లేచి మడి గట్టు కుందా, ఇప్పటికింకా తెమల్లేదు. తనపెళ్లాం ఆడపుట్టుక పుట్ట లేదూ! అక్కడి పూతికపుల్ల యిక్కడపెడితే వొట్టు. శుభ్రంగా వేణ్ణీళ్ళు తొరువుకుని సబ్బుతో స్నానంచేస్తోంది, స్నానం!

తమ్ముడు వేరుండడం మంచిదనీ, అలా అయితేనే కాని సంసారం ఎవరికీ మోయదనీ ఇద్దరికీ క్షేమమనీ ఈ సారింకా గట్టిగా నమ్ముతున్నాడు. ఆనోటా ఈ నోటా తమ్ముడు వేరుం టానని అందరితోనూ అంటున్నట్టు తెలిసి అన్న అగ్గిమద్దై యింటికొచ్చాడు. తిన్నగా వసారాలో నించున్న తమ్ముణ్ణి చూడనైనా చూడకుండా రికార్డు గదిలోకి వెళ్లాడు. రికార్డంతా

తీసి 'నీకంత వేరుండాలనేవుంటే నాతో ఎందుకనగూడదురా ?
ఆ చాట్నీ ఈచాట్నీ అనడమెందుకు ?'

'నేనాచాట్నీ యీ చాట్నీ అన్లేదే ! ?

'అనకపోతే వూరందరికీ ఎలా తెలిసిందంటా ? నేనేదో నీ సొమ్ము బొవుకుంటున్నానని లోకం ఆనుకోవాలనా ?'

'లోకం ఏమీ అనుకోనక్కర్లేదు'

'నువ్వంటే మానేస్తుంది !'

'ఏంయిదేవైనాలోక విడ్డూరవా ?'

'ఆ సహజవే ! అయితే అందరినోళ్ళల్లోనూ నన్నెందుకు పడేయాలి?'

'నిన్నేవీ నేనన్లేదే !'

'మనం వేరుంటామనుకో ! అందరికీ లోకువ కదటరా!'

'అదెవరాలోకువ చేసేవాళ్ళు ?'

'ఉమ్మడి వ్యవహారా లేపూతాయి ?'

'ఇప్పుడేపూతున్నాయ్ ?'

'నేనాబాదరబందీలు పళ్లేను'

'నువ్వూపడక నేనూ పడక ఎలాకుదురుతుందీ ?'

'ఇంతకీ వేరుండవలసిన అగత్యమేమొచ్చిందీ ?'

తమ్ముడికి వొళ్లు ఉడికిపోయింది. భార్యమీద క్రోధ మొచ్చింది. భార్య అతిశయానికాకారణం బాధ్యత తెలియక పోవడమే ! పనీపాటూ లేక వగల బొగలుతూకివిణీ వేస్తున్నది. వంటులమీద పనులన్నీ ఎలాపాడవుతున్నాయో తల్చుకుని 'చూశావా నీగది! ఇంతవరకు పాచిల్లు తుడవనైనా తుడవ

లేదు. ఆవిడచేస్తోందని ఈ విడా, ఈవిడచేస్తుందని ఆవిడాను! మూడురోజులకోసారి పిండివంటలా ? మనం సంసార్లమా ఏవఁ న్నానా ? చెడిపోయిన కాపరానికి ముప్పేవిఁటే చంద్రకాంతా లొండవే పెళ్ళావాఁ అన్నాట్ట '

అన్నయ్యా గదితలుపు తీసిచూశాడు. గదినిండా మన్నూ మశానం. ధూళీ గీళీ. నూద్దగ్గిర ఇనపమూకుడు కాలి నల్ల మసీ, దానిమీద పిండిచుక్కలూ కనిపించాయి.

'చూశావా? ఎన్నాళ్ళయింది కందులుకొని! చింతపండు నాలుగురోజులకంటె హెచ్చువస్తోందా ? పెసరపప్పు ఈవేళకో సరి ' అంటూ తమ్ముడు భడీలున కొట్టుగది తీశాడు. అన్నయ్య యించుమించు కాళీగావున్న గదిచూసి కొయ్యయిపోయాడు.

' నువ్వూ నేనూ అలా తెచ్చిపోయడం. సుఖంలేదో ! సుఖంలేదో ! అని నాన్న కట్టిన ఈ ఇల్లు అచ్చొచ్చిందికాదో ! అని గోలెత్తడం కనబడుతోంది. ఇంట్లో ఇంత అరాచకంవుందని నేను చెప్పేవరకూ నీకు తెలీదు ! '

అన్నయ్య వంటిట్లోంచి వెళ్లబోతూ ఎందుకోమరి ఆగేడు. ఆగి ' నువ్వు వేరుండడం నీకూ మంచిదే; నాకూ మంచిదే ! ' ఒకొ్కక్కవేలే ముడిచి లెక్కబెడుతూ వొకొ్కక్కమాటే చెపుతున్నాడు ' నీ ఆస్తేదో నువ్వు చూసుకోవచ్చు. నా ఆస్తేదో నేనూ చూసుకోవచ్చు ! హెచ్చు ఖర్చవకుండా నువ్వూ నాలుగు రాళ్ళు వెనకవేసుకోవచ్చు. సంసారం ఇద్దరికీ మోస్తుంది. ఇద్దరవన్నూఁబాగుపడతాం '

అన్నదమ్ములు వేరుంటున్నారని మంగమ్మకూ తెలిసింది. అచ్చమ్మకీ తెలిసింది. ఊరంతా పాక్కిపోయింది.

అన్నయ్య వంటింట్లోకి 'నిజమేలే' అని మళ్లీ తలూపి వెళ్ళిపోయాడు.

తమ్ముడు తనగదిలోకి వెళ్ళిపోయాడు. భార్య గుస గుసలు వినిపించాయి. భర్త 'ఫో ఫో' అన్నాడు.

అన్నయ్యకొంచెంసేపు పోయాక వంటింట్లోంచి కేక వేశాడు 'ఒరే తమ్ముడూ! దొడ్డప్పనీ, కక్కనీ పిల్చుకురారా!'

'ఎందుకన్నయ్యా?'

'చరాస్తేకాదురా, స్థిరాస్తికూడా పంచేసుకుందాం!'

అన్నయ్య ఉమ్మడిచిట్టా తీశాడు. చీడీలో చాపమీద చతికిలబడ్డాడు. రికార్డుపెట్టె తెరిచాడు.

తమ్ముడు దొడ్డప్ప గారింటికెళ్లి వచ్చాడు. అన్న పక్క కూచున్నాడు.

అన్నదమ్ము లిద్దరూ వేరుపడిపోతున్నారని మంగమ్మకూ తెలిసింది. అచ్చమ్మకూ తెలిసింది. ఊరంతా పాక్కిపోయింది.

మంగమ్మా, అచ్చమ్మా వెంకునాయుడూ లచ్చుం నాయుడూ, జంగందేవరా, అన్నదమ్ము లింటికొచ్చి గుంపు గూడారు.

ఉమ్మడిచిట్టా తెరచి అన్నదమ్ములు లెక్కలు చూసు కుంటున్నారు. బేరీజు వేసుకుంటున్నారు. విరియా వేసుకుంటు న్నారు. పాతబాకీలు నివాడా చేస్తున్నారు.

మంగమ్మా, అచ్చమ్మా, వెంకునాయుడూ లచ్చుం నాయుడూ జంగం దేవరా అన్నదమ్ములచుట్టూ గుంపుగూడారు.

'ఇదేంచేపలగంప కాదర్రా! అందర్లాగే మేమూ వేరుంటున్నాం' అన్నాడు అన్నయ్య. 'వేరుగాన్నంతమా త్రానకుడికన్నొకటీ ఎడం కన్నొకటీనా?' అన్నాడు తమ్ముడు.

ఉమ్మడి చిట్టా ఉగ్ర నరసింహుడిలా చూసింది. అన్న దమ్ముల మాటలువిని కల కల నవ్వుతున్న తోటి కోడళ్లనవ్వు గదిలోంచి వినవచ్చింది!

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA103B140 |
| పుస్తకం పేరు | ఆకాశ దీపాలు (కథల సంపుటి) |
| తారీఖు | 25-10-2024 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 99 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Rehana |
| పేజీలు విడదీసినది | Haseena |
| స్కాన్ చేసినది | pragathi |
| పరీక్ష చేసినది | |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |